# సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం

జూన్ 2022



# Contents

**సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం** ........ 1
ఆహ్వాన పత్రిక........ 5
అంకితం........ 6
సహస్రచంద్రదర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం తో వారం రోజులు సందడే సందడి ........ 7
నేపధ్యం..... ........ 7
పురస్కారాల సందడి........ 10
కొంచెం ముందుకు .... ........ 11
సహస్ర చంద్ర మాసోత్సవం........ 11
నవగ్రహ పూజ........ 12
ఆయుస్సుహోమం ........ 12
పామర్రు లో పూర్వ విద్యార్థుల సమావేశం........ 13
**వారం రోజులు సందడే సందడి** చివరగా ........ 15
కవి సమ్మేళనం కవితలు........ 17
దైవతాశిస్సు!........ 17
ఈ పుష్కరోత్సవ వేళ సరసభారతి ........ 17
సరస్వతీ సమర్చనం ........ 18
వందనములు వంద వంద వేలు ........ 19
సరసభారతీ జయము జయము ........ 20
ఎవని పలుకు ........ 20
అక్షర లక్షల అక్షరాంజలి........ 21
వందనము వందనము........ 22
వార్ధక్య యవ్వనం –యవ్వన వార్ధక్యం........ 22
భారతీప్రసాదము........ 24
గబ్బిటార్య........ 25
దుర్గా ప్రసాదమై........ 26
సాహిత్య భారతి........ 27

ప్రణతి సరసభారతి......28
పుష్కర మహోత్సవం ......29
సరసభారతి సాహితీ పుష్కర వైభవం......29
దుర్గా ప్రసాదాఖ్యం......30
మహా భారతి ......31
అభినందన అక్షరాంజలి ......31
ప్రతిబింతో......33
పాదాభివందనాలతో..మీ పంతుల ......33
మంకు శీను ......34
అభినందన మందారమాల ......34
నమో నమః......35
శుభాకాంక్షలు......37
ఆడియో ......38
ఛాయా చిత్రాలు......39
సామాజిక మాధ్యమాలలో ......55
వార్తా పత్రికలలో ......56
రచనలు ......58
ముద్రిత రచనలు......58
**సంపాదకత్వం**......59
**అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు** ......59

# ఆహ్వాన పత్రిక


సరసభారతి
సాహిత్య సాంస్కృతిక సంస్థ - ఉయ్యూరు
సరసభారతి 165వ కార్యక్రమంగా
"సాహితీ పుష్కర మహోత్సవం"
సాహితీ బంధువులకు శుభ కామనలు- సరసభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ స్థాపించి 12 సం॥ అయిన సందర్భంగా,సరసభారతి అధ్యక్షులు
శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి
"సహస్ర చంద్ర మాసోత్సవం" పురస్కరించుకొని సరసభారతి165వ కార్యక్రమంగా "సాహితీ పుష్కరోత్సవం" నిర్వహిస్తున్నాము.దీనిలో పుస్తకావిష్కరణ సంగీతవిభావరి, కవి సమ్మేళనం, "సరసభారతి ప్రతిభా పురస్కార ప్రదానం" మొదలైనవి ఉంటాయి. కవి పండితులు, సాహితీ మిత్రులు, సంగీత సాహిత్యాభిమానులు పాల్గొని జయప్రదం చేయ ప్రార్థన.
సభా కార్యక్రమ నిర్వహణ, పర్యవేక్షణ : శ్రీ దండిభట్ల దత్తాత్రేయ శర్మ
"హాస్యదండి" తెలుగు భాషా సమాఖ్య కోశాధికారి,హాస్యలహరి కార్యదర్శి "ప్రముఖ కవి, విశ్లేషకుడు, సంస్కృతాంధ్ర ప్రజ్ఞానిధి స్వర్గీయ శ్రీ కె.వై.ఎల్.ఎన్ కళాపీఠం సంస్థాపకులు - విజయవాడ
సహకారం - శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి ,సరసభారతి - కార్యదర్శి
సభ ప్రారంభకులు - శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి - సరసభారతి గౌరవాధ్యక్షురాలు.
ముఖ్య అతిథి :
శ్రీ జి.వి.ఎల్.నరసింహారావు
రాజ్యసభ సభ్యులు
గౌరవఅతిథి :
శ్రీ వై.వి.బి రాజేంద్ర ప్రసాద్
శాసనమండలి మాజీ సభ్యులు.
తేది , సమయం :
ది : 27-6-2022
సోమవారం
సా॥ 4.00గం॥లకు
వేదిక :
శాఖా గ్రంధాలయం నందు (A/C లైబ్రరి)
(సెంటర్‌లో టాక్సీ స్టాండ్‌వెనుక)
ఉయ్యూరు -కృష్ణాజిల్లా


సరసభారతి
సాహిత్య సాంస్కృతిక సంస్థ - ఉయ్యూరు
"సాహితీ పుష్కరోత్సవం"
కార్యక్రమ వివరం :
సాయంత్రం 3.30 గం॥ల నుండి 4.00 గం॥ల వరకు - అల్పాహారం
సాయంత్రం 4.00 గం॥ల నుండి 4.30 గం॥ల వరకు
శ్రీమతి ఏలేశ్వరాపు రాధికా సుబ్రహ్మణ్యం (మచిలీపట్నం) గారిచే
"సంగీత విభావరి"
సాయంత్రం 4.30 గం॥ల నుండి 5.30 గం॥ల వరకు
కవి సమ్మేళనం
అంశం : " సరసభారతి సాహితీ పుష్కరోత్సవం "
సాయంత్రం 5.30 గం॥ల నుండి 5.45 గం॥ల వరకు
పుస్తకావిష్కరణ
శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ రచించిన
"అణుశాస్త్రవేత్త డా. ఆకునూరి వెంకట రామయ్య"
"Nuclear scientist Dr.Akunuri venkata Ramayya"
పుస్తకానికి "ఆంగ్లానువాద పుస్తకం" ఆవిష్కరణ
స్పాన్సర్: శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతులు (అమెరికా)
ముఖ్య అతిథి : శ్రీ జి.వి.ఎల్.నరసింహారావు - రాజ్యసభ సభ్యులు
ఆవిష్కర్త : శ్రీ వై.వి.బి రాజేంద్ర ప్రసాద్ - శాసనమండలి మాజీ సభ్యులు.


సరసభారతి "సాహితీ పుష్కరోత్సవం"
సాయంత్రం 5.45 గం॥ల నుండి 7.15 గం॥ల వరకు


సరసభారతి "సాహితీ పుష్కరోత్సవం"
సాయంత్రం 5.45 గం॥ల నుండి 7.15 గం॥ల వరకు
విశేష సాహితీ పురస్కార ప్రదానం
10 . శ్రీ బి.హెచ్.వి.కృష్ణరావు - శాఖా గ్రంథాలయాధికారి - ఉయ్యూరు
11 . శ్రీమతి కె.స్రవంతి - శాఖా గ్రంథాలయ సహకారిణి - ఉయ్యూరు
సరసభారతి అపూర్వ సౌజన్య పురస్కార ప్రదానం :
శ్రీమతి పువ్వుల కరుణానిధి, శ్రీ నరసింహరావు దంపతులకు.


సరసభారతి "సాహితీ పుష్కరోత్సవం"
కవి సమ్మేళనంలో పాల్గొనే కవి మిత్రులు
గబ్బిట దుర్గాప్రసాద్
PRAKASH


సరసభారతి "సాహితీ పుష్కరోత్సవం"
శ్రీ మైనేని గోపాలకృష్ణ శ్రీమతి సత్యవతి దంపంతులు(అమెరికా)
శ్రీ సుంకర కోటేశ్వరరావు (హైదరాబాద్)
డా. ఆకునూరి రామయ్య శ్రీమతి కృష్ణమయి దంపతులు(అమెరికా)
డా.రాచకొండ నరసింహశర్మ (విశాఖ పట్నం)
శ్రీ వేలూరి వివేకానంద్ (హైదరాబాద్)
శ్రీ వేలూరి మృత్యుంజయ శాస్త్రి శ్రీమతి విజయలక్ష్మి దంపతులు(అమెరికా)
శ్రీ కోమలి సాంబావధాని శ్రీమతి విజయలక్ష్మి దంపతులు (అమెరికా)
శ్రీ పువ్వుల నరసింహరావు శ్రీమతి కరుణానిధి దంపతులు(ఉయ్యూరు)
శ్రీ జగదీష్ శ్రీమతి లక్ష్మి దంపతులు (అమెరికా) మరియు
షార్లెట్ - సరసభారతి మొదలైన వారి సౌజన్యంతో ...
ఆహ్వానించువారు
శ్రీమతి జోశ్యుల శ్యామలా దేవి - సరసభారతి గౌరవాధ్యక్షులు
శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ - సరసభారతి అధ్యక్షులు
శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి - సరసభారతి కార్యదర్శి
శ్రీ గబ్బిట వెంకటరమణ - సరసభారతి కోశాధికారి
శ్రీ వి.బి.జి. రావు - సరసభారతి సాంకేతిక నిపుణులు
సభ నిర్వాహణ సహకారం :
శ్రీ గబ్బిట రామనాథబాబు, శ్రీ కోనేరు చంద్ర శేఖరరావు, శ్రీమతి సీతంరాజు మల్లిక,
శ్రీ మాదిరాజు శ్రీనివాసశర్మ, శ్రీ చౌటాడ అప్పలనాయుడు (సోదరులు)
ప్రత్యక్ష ప్రసారం: http://sarasabharati.wordpress.com
http://sarasabharativuyyuru.wordpress.com
http://suvarchalaanjaneyaswami.wordpress.com
విందు: రాత్రి7.30 గం॥ లకు
తెలుగులో మాట్లాడటం మన జన్మ హక్కు.

## అంకితం



శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి సహస్రచంద్రదర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం తో వారం రోజులు సందడే సందడి అను ఈ చిన్ని సంకలనం కీర్తి శేషులు గబ్బిట నాగ గోపాల కృష్ణమూర్తి గారికి అంకితం. ఇందులో ఆహ్వాన పత్రిక , శ్రీ దుర్గా ప్రసాద్ గారి సహస్రచంద్రదర్శనం జరిగిన విధానం, విశేషాలు, కవి సమ్మేళనం లో చదివిన కవితలు, youtube లో కార్యక్రమ వీడియోలు లింక్ నొక్కి చూడవచ్చు.

## సహస్రచంద్రదర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం తో వారం రోజులు సందడే సందడి

# నేపథ్యం.....

83 సంవత్సరాల 4 నెలలు పూర్తి అయితే 1000 చంద్రోదయములు చూసిన పుణ్యం ఆనాటికి కలుగుతుంది. దీనినే సహస్ర చంద్రోదయము అని అంటారు చంద్ర రథారోహణ్ అని కూడా పిలిచే సహస్ర చంద్ర దర్శన్‌ను 82 లేదా 83వ ఏట నిర్వహిస్తారు. సహస్ర చంద్ర దర్శన్‌ను ఉత్తర భారతం, నేపాల్, కర్ణాటక, ఏపీల్లోని కొన్ని ప్రాంతాల్లో జరుపుకొంటారు. వీరు వెయ్యి పున్నములే కాదు వెయ్యి అమావాస్యలు చూసిన వారు.

శ్లోకం; వయోవస్థా శాంతయః పంచాశత్ వర్షమారభ్య పంచభిః పంచభిః వర్షైర్యుక్తాః। (అన్యమతేన - షష్టితమ వర్షమారభ్య దశభిర్దశభిర్వర్షైః శాంతిరుక్తాః)

శ్లో॥ వైష్ణవీ వారుణీ చైవ తతశ్చోగ్రరథీ తథా । మహారథీ భీమరథీ ఐంద్రీచైవ విశేషతః ॥1॥

చాంద్రీదార్శనికీ రౌద్రీ సౌరీ మృత్యుంజయీ తథా మహామృత్యుంజయీ శాంతిః క్రమశశ్చ ప్రకీర్తితాః ।

అరిష్ట పరిహారార్థం శాంతిం కుర్యాత్ప్రయత్నతః ॥2॥

జూన్ 20 వ తేదీ సోమవారం జ్యేష్ట బహుళ సప్తమి తిధుల ప్రకారం నా పుట్టిన రోజు అంటే సహస్ర చంద్ర మాసోత్సవం అవటం, తేదీల ప్రకారం 27-6-22 సోమవారం నాకు 82 వెళ్లి 83 రావటం, సరసభారతి స్థాపించి 12 ఏళ్ళు అవటం తో, అనుకోకుండా ఇంతటి బృహత్తర కార్యక్రమం సంకల్పించటం జరిగింది. దీనికి ప్రేరణ అమెరికాలో ఉన్న మా అమ్మాయి శ్రీమతి విజయలక్ష్మి కి ఈ ఆలోచన రావటం, ఉయ్యూరులో ఉన్న మా అబ్బాయి రమణ" తాన అంటే తందానా, "అనటం

హైదరాబాద్ లో ఉన్న మా అబ్బయిలు శాస్త్రి శర్మ, " తలలు ఊపటం" తో నాకు గ్రీన్ సిగ్నల్ ఇవ్వక తప్పింది కాదు. ఆలోచన అమ్మాయిది, కర్తవ్య నిర్వహణ అబ్బాయిది. సాధారణంగా నేను ఒప్పుకోను. కానీ వయసు మీద పడుతోంది, ఇదివరకైతే, "రయ్యి మంటూ" స్కూటర్ పై ఎక్కడికైనా వెళ్లి వచ్చేవాడిని. ఇప్పుడు నన్ను అలా వెళ్ళ నీయటం లేదు మా అబ్బాయి, మనవడు చరణ్, మనవరాలు రమ్య. వాళ్ళే నన్ను ఎక్కడికైనా తీసుకు వెళ్లి తీసుకు వస్తున్నారు. కనుక ఈ రకంగా నా స్వేచ్ఛ కూడా కొంత తగ్గినట్లే. దీనికి తోడు రెండేళ్ళ కరోనా ఫలితంగా సరసభారతి ఉగాది వేడుకలు నిర్వహించ లేక పోవటం మనసులో ఏదో వెలితిగా ఉంది. కనుక నా పుట్టిన రోజు జూన్ 27 న నా పుట్టిన రోజుతోపాటు , "సరసభారతి సాహితీ పుష్కరోత్సవం, "జరిపి సాహితీ బంధువులను అందరినీ ఆహ్వానించి, సాహిత్యం లో విశిష్ట విశేష సేవలందించిన మహనీయులను ఆత్మీయం గా సత్కరించి, కవులతో కవి సమ్మేళనం చేయించి, నేను రాసిన, "అణు శాస్త్ర వేత్త డా. ఆకునూరి వెంకట రామయ్య, " పుస్తకాన్ని ఇంగ్లీష్ లోకి అనువదింపజేసి నాకు,సరసభారతి కి అరుదైన గౌరవం కల్గించిన స్పాన్సర్ శ్రీ మైనేని గోపాల కృష్ణ శ్రీమతి సత్యవతి దంపతులు(అమెరికా ) కృతజ్ఞతగా ఆ ఆంగ్ల

పుస్తకాన్ని ఆవిష్కరించటం చేస్తే బాగుంటుంది అనిపించింది. సాహితీ బంధువుల సమక్షం లో ఇక నేను కార్యక్రమాలు తగ్గించుకొని లైవ్ లో మాత్రమే సరసభారతి ని నిర్వహిస్తానని అందరికి తెలియ చేయటం నా ధర్మగా భావించాను. అదే చేశాను.

కొందరు ప్రముఖులను గత రెండేళ్లుగా ఆహ్వానించినా పెద్ద ఎత్తున సభలు జరిపి సన్మానించలేక పోయాము అనే అసంతృప్తి ఉంది. కార్యక్రమాలు ఆపకుండా మా శ్రీ సువర్చలాన్జనేయ దేవాలయం లో నిర్వహిస్తూ కవి సమ్మేళనం తప్ప పుస్తకావిష్కరణలు స్థానికులకు ఆత్మీయ సన్మానాలు చేశాం. కనుక కొంచెం భారీగా ఈ సారి కార్యక్రమం జరపాన్న ది నా తలపు. అతిధులను అందర్నీ నేనే ఫోన్ లో మాట్లాడి ఆహ్వానించాను. నేను అనుకొన్న పేర్లు కాక ఇంకెవరైనా ఉంటె చెప్పమని శ్రీ దండి భొట్ల దత్తాత్రేయ శర్మగారిని అడిగితె, ఆయన అవధాన రవళి శ్రీ ఆముదాల మురళి గారి పేరును, బాల అవధాని చి. ఉప్పలధడియం భరత్ శర్మ ను సూచిస్తూ, సంగీత కచేరీ కూడా ఉంటె బాగుంటుందని, "సన్నాయి నొక్కులు నొక్కారు, "మంచి ఆలోచన అంటూ ఎవర్ని పిలుద్దాం అంటే బందరుకు చెందిన శ్రీ మతి ఓలేటి రాధికా సుబ్రహ్మణ్యం పేరు సూచించగా, "వాయస్, "అన్నాను. వారినే ఆ ముగ్గుర్ని ఆహ్వానిస్తే, ఆయన మురళి గారి నంబర్ నాకు ఇవ్వకపోవటం నేను అడగక పోవటం జరిగి ఆయన తప్ప మిగిలిని ఇద్దర్నీ ఫోన్ చేసి ఆహ్వానించాను. ఇవన్నీ ఎప్పటికప్పుడు బులెటిన్ ల లో పెడుతుండగా వరంగల్ లో శ్రీ లేఖ సాహితీ సంస్థను నిర్వహిస్తున్న నాకు ఆత్మీయులు మా పురస్కారం అందుకొన్నవారు డా. టి.రంగస్వామి మెయిల్ రాసి మద్రాస్ లో ఉన్న శ్రీ గుడిమెట్ల చెన్నయ్యగారి సాహితీ సేవా కార్యక్రమాలు రాసి వీలుంటే చూడండి అనగా వెంటనే నంబర్ రాయమంటే, రాయగా వారితో మాట్లాడాను." సరే, "అంటూ హోసూరు లో తెలుగు సంస్థ నిర్వాహకులు డా వసంత్ ఉగాది కవి సమ్మేళన కవితల, "పోత్తానికి" నేను సమీక్ష చేస్తూ వారి కవితను మెచ్చుకొన్న విషయం గుర్తు చేశారు. శ్రీ బెల్లం కొండ నాగేశ్వరరావు గారినీ గత రెండేళ్లుగా ఆహ్వానిస్తూనే ఉన్నాం. ఈ సారి అయినా తప్పక వస్తారనుకొంటే అకస్మాత్తుగా వారికి ఆరోగ్య సమస్య వచ్చి రాలేక పోయానని నిన్ననే తెలియజేశారు. అలాగే మద్రాస్ లో ఉంటున్నడా మాడభూషి శ్రీధర్ గారి శిష్యురాలు శ్రీమతి లేళ్లపల్లి శ్రీదేవి నిరుడు మాడభూషి వారు, "జూమ్, "లో నిర్వహించిన సాహితీ కార్యక్రమం లో నన్ను పరిచయం చేసి అప్పటినుంచి నన్ను, "బాబాయి గారు, "అంటున్న ఆమెను ఆమె భర్తనూ ఆహ్వానించా. ఆమెకు కూడా అకస్మాత్తుగా జ్వరం వచ్చి రాలేక పోయారు. డా ఎన్.భాస్కరరావు గారు ఢిల్లీ లో ఉండిపోవాల్సి వచ్చి రాలేదు. వీరు తప్పఅందరు హాజరవటం ఆనందంగా ఉంది.

విశిష్ట, విశేష పురస్కార గ్రహీతలలో ఉన్న నర్మదా రెడ్డి. భవానీ, ప్రకాష్ గార్ల కూ రెండేళ్ల నుంచి, "డ్యూ".వీరూ రావటం సంతోషం. శ్రీ సుబ్రహ్మణ్యంగారు చిరపరిచితులు, బదరీగారు నిడదవోలులో రెండేళ్ళక్రితం పరిచయం. టేకు మళ్ల వారు దాదాపు పదేళ్లుగా పరిచయం. మా కార్యక్రమాలకు తప్పక వచ్చేవారు. మా త్యాగరాజ ఆరాధనోత్సవాలకు వారి శ్రీమతి చిదంబరి గారు వచ్చి కోమల గాత్రంతో అలరిస్తారు. గంధం వారి కథా గంధాన్ని ఆస్వాదించి వారి, రెండు సంపుటాలలోని కథలను, వారి అన్నగారు శ్రీ వేంకాస్వామి గారి రెండు సంపుటాలలోని కథలను సరసభారతి ప్రత్యక్ష ప్రసారం ద్వారా మరోసారి సాహితీ లోకానికి పరిచయం చేసే అదృష్టం కలిగింది. వీరితోదాదాపుగా పాతిక ఏళ్ళ పరిచయం. వారి రాక మాకెంతో ముదావహం. శ్రీ చలపాక, శ్రీ కళాసాగర్ సరసభారతి పుస్తక ప్రచురణకు వెన్నుదన్ను గా నిలిచినవారు. మా దూరపు బంధువు, పురాతత్వ శాస్త్ర వేత్త శ్రీ వేలూరి కృష్ణ శాస్త్రి గారి తర్వాత మళ్ళీ ఆశాఖలో మంచి పేరు తెచ్చుకొన్న గాడేపల్లి రామకృష్ణారావు మా రెండవ బావగారు శ్రీ వేలూరి వివేకానంద్ గారి మేనల్లుడు. శ్రీమతి మైలవరపు లలితకుమారి గొప్ప విద్వాంసురాలు. ఆమె రావటం కూడా శోభచేకూర్చింది.ఆమె భర్త రామ శేషు గారు నాకు" ఫాన్". శ్రీమతి కేసేరుకల్పన, శ్రీ పంతుల వెంకటేశ్వరరావు గార్లు మాకు పాతకాపులే. ఉయ్యూరు లో సాహితీ ప్రియులు కవి విమర్శకులు శ్రీ సారదిగారు. అలాగే ఉయ్యూరు శాఖా గ్రంధాలయ నిర్వాహకులు శ్రీ కృష్ణారావు గారు శ్రీమతి స్రవంతి గార్లు. వీరిద్దరి సాహితీ సేవ మరువలేనిది. ఇంకా ఎవరినైనా మర్చిపోతే మన్నించండి.

అంతేకాక ఎందరెందరో వదాన్యులు నేను అడగకుండానే సరసభారతి కార్యక్రమాలకు ఆనందిస్తూ స్వచ్ఛందంగా విరాళాలిచ్చిన దాతలకు సభా ముఖంగా కృతజ్ఞతలు తెలుపుకోవటమూ ఇందులో పరమార్ధంగా భావించాము. అందుకే ఆహ్వానం లో వారి పేర్లు రాసి, "సౌజన్యం తో, "అని కృతజ్ఞత చెప్పుకొన్నాం. ఇంత వరకు బాగానే ఉంది. కవి సమ్మేళనం జరగాలి కదా. విషయం, "సరసభారతి సాహితీ పుష్కరోత్సవం, "అని నేనే చెప్పి ఇదంతా మా సంస్థ,దాని నిర్వాహకునిగా నేనే ఎక్కువగా కనిపిస్తాను కనుక, "కవులను వచ్చి నాకు డప్పు కొట్టండి, "అని అడిగితె బాగుండదు అని దత్తాత్రేయ శర్మగారికి చెప్పి కవులను ఆహ్వానించే

బాధ్యతా, శీర్షికను వారికి తెలియ జేసే బాధ్యతే కాక మొత్తం కార్యక్రమాన్ని అలాంటి పండితుని చేత నిర్వహిస్తే బాగుంటుందని వారిని ఒప్పించి కవుల ఫోన్ నంబర్లు ఇచ్చి ఆయనతోనే వారికి ఫోన్ చేయించా. 36 పేర్లు సేకరించి ఆయన తెలియ జేసినా, సుమారు ఇరవై మంది మాత్రమె వచ్చారు. పురస్కార గ్రహీతలకూ అవకాశమివ్వటం తో రక్తి కట్టింది. దీనికి శర్మగారికి అభినందనలు. పురస్కార గ్రహీతలకు" ఉడతా భక్తి గా, " సత్కారం శాస్త్రోక్తంగా నిర్వహించి మా శక్తిని బట్టి నగదు కానుక అందించాం. వారి విద్వత్ కు శక్తి సామర్ధ్యాలకు మేమిచ్చింది తులతూగేది కాదు. , కవులనూ అలాసే సత్కరించి నగదుకానుక లందించి సంతృప్తి చెందాం.

హైదరాబాద్ లో ఉన్న మా అబ్బాయిలు శాస్త్రి శర్మలు కోడళ్ళు కుటుంబాలతో రావాల్సి ఉంది. సరిగ్గా నెల క్రితమే మా మనవడు చి.చరణ్ ఉపనయనానికి అందరూ వచ్చారు కనుక పిల్లల పరీక్షలు చదువులు ఉద్యోగాలవలన రాలేక పోయారు. కానీ మా మనవడు ఛి హర్ష కు ఇలాంటి కార్యక్రమాలు అంటే మహా ఇష్టం. ఈ తాతగారిపై వాడికి అమితమైన గౌరవం. నా లైవ్ ప్రోగ్రామ్స్ అన్నీ చూస్తాడు. బిటెక్ సెమిస్టర్ పరీక్షలు వారం రోజులుగా రాస్తూ అలిసిపోయి ఆటవిడుపుగా ఇక్కడికి రావాలని తండ్రిపై ఒత్తిడి తెస్తే, బలవంతం మీద మా అబ్బాయి శర్మ వాడితో వచ్చి నేను అప్పగించిన కార్యక్రమం చక్కగా నెరవేర్చి సంతోషం కలిగించాడు. ఉయ్యూరు మనవడు చరణ్, మనవరాలు రమ్య చదువులు పరీక్షలు, కాన్ఫరెన్స్ లవలన ఎక్కువ సేపు ఉండలేక పోయారు. మా కోడలు శ్రీమతి రాణి ఇంట్లో ఇచ్చిన సహకారం ఎన్న తగినది.అలాగె నాలుగవ కోడలు శ్రీమతి మహేశ్వరి ఆఫీస్ పని,ఈ సభా కార్యక్రమం లో గొప్ప సహకారం అందించింది.

కార్యక్రమం అరగంట ఆలస్యంగా మొదలవటం, నేనుఎంత పకడ్బందీగా ప్లాన్ ఇచ్చినా, వేదికపై తొట్రు పాట్లు జరిగాయి. పురస్కార గ్రహీతల స్పందనకు అవకాశం కలగనందుకు వారిని క్షమించమని వేడుకొంటున్నాను. వారందరూ మాట్లాడితే బాగా ఉండేది. కానీ చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని, రైల్ కి వెళ్లాలనో, బస్ టైం అయిందనో కంగారులో మాట్లాడలేక పోయి ఉంటారు.

ఈ బృహత్తర కార్యక్రమానికి బ్రహ్మశ్రీ అన్నదానం చిదంబర శాస్త్రి గారు విచ్చేయటం మన, మా అదృష్టం. మూర్తీభవించిన బ్రాహ్మీ మూర్తులు వారు. ఒక వేదవ్యాస మహర్షియో, వాల్మీకి మహర్షియో, పరాశర మహర్షియో విచ్చేసిన అనుభూతి కలిగింది. వారు సరసభారతిని, నన్ను ఆశీర్వదించటం వేదాశీస్సుగా భావిస్తున్నాను. వారికి మరొక్క సారి కృతజ్ఞతలు తెలుపు కొంటున్నాను.

ఎసి లైబ్రరీ లో జరగాల్సిన కార్యక్రమంప్రత్యక్ష ప్రసారానికి, సంగీత కచేరీకి ఇబ్బంది అవుతుందని, సరిగ్గా రెండురోజుల ముందు మాత్రమె గ్రహించి, శివాలయం ట్రస్ట్ బోర్డ్ చైర్మన్ వదాన్యులు శ్రీ కుటుంబ రాజు గారి బిల్డింగ్ లో వారి తోడ్పాటు తో నిర్వహించాం. ఎసి అలవాటైన కొందరికి ఇబ్బంది కలిగించి ఉండచ్చు ఈ అసౌకర్యానికి మన్నించండి. రాజుగారికి కృతజ్ఞతలు. వారి సౌజన్యం మరువలేనిది.ఈ మధ్య మన భారీ కార్యక్రమాలు కెసీపి దగ్గరున్న రోటరీ ఆడిటోరియం లో జరిగేవని మీకు తెలుసు అక్కడ మనకు అన్ని రకాల సహాయ సౌకర్యాలు అందించే శ్రీ కొండలు గారు మరణించటం, ఇప్పుడున్న వారితో మాకు పరిచయాలు లేకపోవటం వలన అక్కడ జరపలేదు.

ఇవన్నీ ఒక ఎత్తు. దాదాపు వంద మంది పైగా సాహిత్య సంగీతాభిమానులు పాల్గొని సభను దిగ్విజయం చేశారు. వారందరికీ ధన్యవాదాలు. లైవ్ ప్రసారం, ఫోటోగ్రఫీ నిర్వహించిన శ్రీ ప్రకాష్ అతని బృందం అభినందనీయులు. వేదిక ఏర్పాటు తో సహా సభకు కావాల్సిన హంగు లన్నీ సమకూర్చిన మా అబ్బాయి రమణ అభినందనీయుడు. వాడికి సహకరించిన వారికీ ధన్యవాదాలు. సరసభారతి గౌర వాధ్యక్షులు శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి గారికి నిర్వహణ సహకారం అందించిన కార్యదర్శి శ్రీమతి మాదిరాజు శివలక్ష్మికి, భర్త శ్రీ శ్రీనివాస శర్మ గారికి సాంకేతిక నిపునులుశ్రీ విబిజి రావు గారికి, మా అన్నగారబ్బాయి చి రామనాద్ బాబు కు శ్రీమతి మల్లిక గారికి ప్రత్యేక ధన్యవాదాలు. జాగృతి సంస్థ వారు ఉత్సాహంగా పాల్గొని ఘన విజయం చేకూర్చి ఫినిషింగ్ టచ్ ఇచ్చి నందుకు అభినందనలు.

అందర్నీ ఆహ్వానించి, వారికి సరైన ఆతిధ్యం ఇవ్వటం మా ధర్మం. కనుక మంచి ఉపాహారం, టీ అందించి చివరికి కమ్మని విందు కూడా ఇచ్చి సంతృప్తి పరచాం. శ్రీ ప్రసాద్ గారి కేటరింగ్ అద్భుతంగా ఉందనీ అన్నీ రుచికరంగా ఉన్నాయని అందరూ భావించి సంతృప్తిగా భోజనం చేశారని అందరూ చెప్పగా మా దంపతులం చాలా ఆనందించాం.

అసలు సందడి రేపు రాస్తాను. ఇది నేపధ్యం మాత్రమె.

**పురస్కారాల సందడి**

నిన్నటి మొదటి ఎపిసోడ్ లో చి. శిష్టు సత్య రాజేష్ గురించి చెప్పటం మర్చిపోయాను.. సుమారు అయిదేళ్లుగా పరిచయమున్న ఉత్సాహవంతుడైన సాహితీ కార్యకర్త. గోదావరి రచయితల సంఘం అధ్యక్షుడు. శ్రీ మతి డొక్కా సీతమ్మగారు, శ్రీ ఎస్పి బాలు గార్లపై కవితలు రాయించి సంస్థ తరఫున ప్రచురించాడు. అలాగే బాలలకోసం కథలు, కవిత్వం రాయించి సంకలనాలు తెచ్చాడు. జూమ్ మీటింగ్ లు నిర్వహిస్తాడు. అతడికి విశేష పురస్కారం ఇచ్చాం. అలాగే 58 ఏళ్ళ క్రితం ఉయ్యూరు హైస్కూల్ లో ట్యూషన్ లో నా శిష్యురాలు, ఉయ్యూరు స్వగ్రామం భర్తగారిది కూడా ఉయ్యూరు అయిన శ్రీమతి పువ్వుల కరుణానిధి సరసభారతికి అత్యంత ఆప్తురాలు. రామగుండం లో ఉన్నా ఉయ్యూరు వస్తే ఆ దంపతులు మా ఇంటికి వచ్చి కనపడే వినయశీలి, స్వచ్చందంగా మా సంస్థకు విరాళాలు అందించే భక్తురాలు. కనుక కరుణా నిధి, శ్రీ నరసింహారావు దంపతులకు" ప్రత్యేక ఆత్మీయ సౌజన్య పురస్కారం" అందించాం. నిన్న డా. మాడభూషి సంపత్కుమార్ అని రాయటానికి బదులు శ్రీధర్ అని పొరబాటుగా రాశాను. ఇవన్నీ కవర్ చేసుకోవటానికి సారీ సరిదిద్దుకోవటానికి చేసిన ప్రయత్నమే ఇది.

వారం రోజుల సందడి గురించి రాయటానికి ముందు కొన్ని సంగతులు రాయాలి. నిరుడు మార్చి 22 న మా మూడవ అబ్బాయి డా నాగగోపాలమూర్తి అకస్మాత్తుగా గుండె పోటుతో మరణించాడు. ఆసంగతి మీకు తెలుసు. ఈ మార్చి 9,10,11 తేదీలలో అతని సంవత్సరీకాలు పూర్తయ్యాయి. దానికోసం ఇళ్ళకు సున్నాలు వేయించటం హడావిడి. ప్రతి ఏడాది మాఘమాసం లో ఒక ఆదివారం మా శ్రీ సువర్చలాన్జనేయస్వామి దేవాలయం లో ఉదయం పూట పాలుపొంగించి ఉచితంగా సామూహిక శ్రీ సత్యనారాయణ వ్రతాలు జరిపి భోజనాలు ఏర్పాటు చేసేవాళ్ళం. కానీ ఈ సారి మాఘం లో కుదరక ఫాల్గుణ శుద్ధ ఏకాదశి ఆదివారం 13-3-22 ఘనంగా నిర్వహించి విందు ఏర్పాటు చేశాం.



తర్వాత ఏప్రిల్ 2 న శ్రీ శుభకృత్ సంవత్సర ఉగాది వేడుకలు మా దేవాలయం లో, మధ్యాహ్నం ఇంటి దగ్గర ప్రత్యక్ష ప్రసారంగా పంచాంగ శ్రవణం, సాయంత్రం గండి గుంట దత్త గుడిలో పంచాంగ శ్రవణం చేశాను.

శ్రీరామనవమికి శ్రీసీతారామ కల్యాణం మనగుడిలో వైభవంగా నిర్వహించాం.

మే 22 ఆదివారం మా మనవడు చి. సుస్మిత్ శ్రీ చరణ్ గౌతమ్ ఉపనయనం మా ఇంటి వద్దే చేశాం. మా అబ్బాయి రమణ కోడలు మహేశ్వరి పీటలమీద కూర్చుని ఉపనయనం చేశారు. దీనికి హైదరాబాద్ నుంచి మా అబ్బాయిలు కోడళ్ళు మనవలు మనవరాళ్ళు హైదరాబాద్ లో ఉన్న మేనల్లుడు మేనకోడలు దంపతులు మా బావమరది ఆనంద్, భార్య, కొడుకు, కోడలు, మద్రాస్ లో ఉండే మేనల్లుడు కుటుంబం తో సహా వచ్చి పాల్గొన్నారు. మా శిష్యులు మల్లాది సత్యం, వెంకటేశ్వర్లు మా ఇంటికి అప్పుడు చిలుకూరి దంపత్యుక్తంగా, అలాగే మా మూర్తి అత్తగారు బావమరదులు కుటుంబాలతో సహా వచ్చి నిండుతనం తెచ్చారు. బెజవాడ నుంచి మా తోడల్లుడు కుటుంబం,

అలాగే బంధువులు మిత్రులు అభిమానులు విచ్చేసి వటువును ఆశీర్వదించారు. మా దంపతులకు మా రమణ దంపతులకు చరణ్ కూ నూతన వస్త్రాలు అంద జేశారు. మేమూ అందరికీ బట్టలు పెట్టాం. మంచి విందు, మామిడి పళ్ళతో సహా ఇచ్చాం. మా మేనల్లుళ్లు మేనకోడలు మా అబ్బాయిలకు రసం మామిడి పళ్ళు తలొక 50 ప్రత్యేకంగా పాక్ చేయించి ఇచ్చాం కనుక ఇదో సందడి.

అలాగే మే 23,24,25 సోమ,మంగళ, బుధ వారాల్లో శ్రీహనుమజ్జయంతి ని అత్యంత వైభవంగా మూడు రోజులు నిర్వహించాం మొదటి రోజు ఉదయం స్వామి వారికి అష్టకలశ స్నపన, అభిషేకం, నూతన వస్త్రధారణ. గంధసిన్దూరం, చామంతి, గులాబిపూలతో పూజ సాయంతం సంగీత విభావరి, రెండవరోజు మంగళవారం ఉదయం" వెయ్యి రసం మామిడి పళ్ళతో స్వామి వారలకు విశేష పూజ, సాయంతం ధార్మిక ఉపన్యాసం, వైశాఖ బహుళ దశమి బుధవారం శ్రీ హనుమజ్జయంతి నాడు ఉదయం 6గం.నుంచి 9 వరకు తమలపాకు పూజ, 10గం.లకు స్వామి వారల శాంతి కల్యాణం సాయంత్రం మహిళా భక్తులచేశ్రీ హనుమాన్ చాలీసా పారాయణ, వడమాల. నిన్న చేసిన మామిడి పళ్ళ ప్రసాదాన్ని కల్యాణం సమయంలోనూ, రాత్రి చాలీసా సమయం లోనూ భక్తులకు అందజేశాం. రాత్రి 108కొబ్బరి కాయలు కొట్టించి కార్యక్రమం పూర్తీ చేయించాం. ఈ హనుమజ్జయంటికి ధ్వజ స్తంభం తో సహా గుడి గోడలకు అన్నిటికి రంగులు వేయించి ముస్తాబు చేశాం. ,

జూన్ మధ్య లో మాకుతుమ్బం అంతా కారులో ద్వారకాతిరుమల వెళ్లి స్వామి వారి దర్శనం చేసుకొని వచ్చేటప్పుడు మా గబ్బిట వారి రామారావు గూడెం అగ్రహారం లో మా స్థలం లో ఉన్న మా ఇలవేల్పు శ్రీ భాక్తాన్జనేయస్వామిని దర్శించి స్వయంగా పూజచేసి, అక్కడి పూజారిణి శ్రీమతి రమాదేవి కి నూతనవస్త్రాలు నగదుకానుక అందించి ఇంటికి తిరిగి వచ్చాం. ఇంతటి తీరిక లేని కార్యక్రమాలు పూర్తీ అయ్యాక అసలు సందడి ప్రారంభ మైంది. ఆవివరాలు మరో ఎపిసోడ్ లో తెలియజేస్తాను.

**కొంచెం ముందుకు ....**

జూన్ 20 కి ముందు పది రోజులక్రితం పామర్రు జిల్లా పరిషత్ హైస్కూల్ 1986-87 దవ తరగతి విద్యార్ధి నాయకుడు గ్లాడ్ స్టన్ ఫోన్ చేసి జూన్ 26 ఆదివారం ఉదయం 9 కి పామర్రు శ్రీ కన్యకా పరమేశ్వరి దేవాలయ ప్రాంగణం లోని ఫంక్షన్ హాల్ లో పూర్వ విద్యార్ధుల అపూర్వ సమ్మేళనం ఉంటుందని, నన్ను తప్పకుండా రావలసిందని అందరి తరఫున ఆహ్వానించాడు. సరే అన్నాను. మరో నాలుగు రోజులతర్వాత ఆ బాచ్ విద్యార్ధులు ఒక అరడజను మంది కారు లో మా ఇంటికి వచ్చి ఆహ్వానించి ఆహ్వాన పత్రిక అందించి వెళ్ళారు. నేనూ వారిని 20,27 కార్యక్రమాలకు రమ్మని ఆహ్వానించి వాట్సాప్ లో ఆహ్వానం పంపాను. .

# సహస్ర చంద్ర మాసోత్సవం

జ్యేష్ట బహుళ సప్తమి తిదులప్రకారం నా పుట్టిన రోజు నాడు ఉదయం 5కే లేచి కాలకృత్యాలు తీర్చుకోగా మా మనవడు చి.చరణ్ కు, నాకూ మా శ్రీమతి,మా మనవరాలు రమ్య ముఖాన కుంకుమ బొట్టు పెట్టి, మాడున చమురు పెట్టి మంగళహారతి అద్దారు. వారిద్దరికీ కానుకలిచ్చాను. ఆ తర్వాత తలంటిస్నానం చేసి, సంధ్యావందనం, పూజ చేసి కొబ్బరికాయ కొట్టాను. ఇంతలో శ్రీ మతి భావానిగారు భర్త రాంబాబు గారు వచ్చి పళ్ళు తాంబూలం ఇచ్చి నమస్కరించి ఆశీర్వాదాలు అందుకొన్నారు. ఉదయం 7-30కు మా అబ్బాయి రమణ దావూద్ కారు తీసుకొని వచ్చి మమ్మల్నిద్దర్నీ భవాన్ని గారినీ ఎక్కించి మంగళ వాద్యాలు ముందు నడుస్తుండగా, రావి చెట్టు బజారు గుండా మన శ్రీ సువర్చలాన్జనేయస్వామి దేవాలయం దగ్గరున్న ఫంక్షన్ హాల్ దాకా తీసుకు వెళ్లి, అక్కడ మా పూజారి రమణ తో హారతి ఇప్పించి, పుష్పమాలలు వేసి, ,పూర్ణ కుంభం తో మమ్మల్ని నడిపించి ఆలయం దగ్గరకు సన్నాయి మేళం తో మాపై ఇరువైపులా బాలబాలికలు అత్యుత్సాహం గా పూలను శిరసు,పాదాలమీద చల్లిస్తూ,పెద్ద సినిమా సెట్టింగ్ లాగా ఆలయం దగ్గరకు తీసుకొని వెళ్ళారు ఫోటోలు వీడియోలు జోరుతో. ఇది మేము ఊహించని విషయం. అవాక్కయ్యాం. కానీ అద్భుతః అని పించేట్లు చేశాడు రమణ. బడ్డీ కొట్టు బుడ్డీ, పెద్దాడు మొదలైన వారంతా. ఆలయం

వద్ద ఆ రోజు బెజవాడ నుంచి వచ్చిన  నవగ్రహ పూజ, ఆయుష్షు హోమం చేసే శ్రీ వంశీకృష్ణమాచార్యులు, ఆయన సహాయకుడు  మాకు స్వాగతం పలికి ఆలయ ప్రవేశం చేయించి, ప్రదక్షిణాలు చేయించి ఆలయం లోకి ప్రవేశింప జేశారు. అప్పటికే ఆలయమంతా అరటి పిలకలు, పూల తోరణాలు తో సర్వాంగ సుందరంగా ముస్తాబు చేసి ఉంచారు. శ్రీ అర్చలాఞ్జనేయ స్వాముల దివ్య విగ్రహం దర్శనం చేశాం. హారతి ఇచ్చి మా అర్చకస్వామి వేదాంతం మురళీ కృష్ణ  అష్టోత్తర సహస్రనామ పూజ ఆరంభించాడు. అప్పటికే ఆలయం లో హోమ వేదిక తయారు చేసి ఉంచి దానికి పసుపు, కుంకుమ అలంకరణ ముగ్గులు తీర్చి దిద్దారు.

# నవగ్రహ పూజ

మేమిద్దరం 'పీటాదిపతులం, “అంటే కింద కూర్చో లేని వాళ్ళం కనుక కుర్చీలలోనే వేం చేయించి వంశీ కృష్ణ నవగ్రహ పూజ చేయించాడు. ప్రతి గ్రహానికి ఆవాహన చేయించ ఆగ్రహ బొమ్మను పెట్టి ఆగ్రహానికి యిష్టమైన రంగు పూలతో ఒక్కో గ్రహానికి కిలో పూలతో పూజలు చేయించారు మాతోనూ, మా అబ్బాయి రమణ, మహేశ్వరి దంపతులతో. అగరు, జాజి, జవ్వాది కుంకుమపువ్వు, శ్రీగంధం మొదలైన 9 ద్రవ్యాలతో వరుసగా ధూపం వెలిగిస్తూ నవ గ్రహాలకు  ధూపం మాతో వేయించారు.  ఇది కన్నులపండుగగా ఉంది.  ఇంతవరు ఇలా చేయటం చూడలేదు. వంశీ యువకుడే. మా రమణ ఎక్కడో ఆతను చేయించే విధానం చూసి ముచ్చటపడి  డా.దీవి చిన్మయ గారితో మాట్లాడించి పిలిపించాడు. గ్రహాలకు కొబ్బరి కాయలు కొట్టించి హారతి ఇప్పించారు. ఆ తర్వాత మా సువర్చలాఞ్జనేయ స్వామికి, “దధ్యోజనం, “బాలభోగంగా నైవేద్యం పెట్టించి, హారతి ఇప్పించి, లఘు మంత్రపుష్పం ఇప్పించి  శటారి ఇప్పించి ప్రసాదం ఇవ్వగా అందరందద్యోజన ప్రసాదం కళ్ళకద్దుకొని భుజించాం. అప్పటికి సమయం సుమారు 9 అయింది.  శ్రీ దండిభోట్ల దత్తాత్రేయ శర్మగారు బెజవాడ నుంచి వచ్చి, చూసి  మా దంపతులకు  నూతన వస్త్రాలు సమర్పించి బందరులో ఏదో పని ఉంటి వెళ్ళారు. మా అన్నయ్యగారబ్బాయి రాంబాబు మద్రాస్ నుంచి వచ్చిన మా మేనల్లుడు శ్రీనివాస్, మా మిత్రులు శ్రీ కోసేరు చంద్ర శేఖరరావు గారు, శ్రీ కాట్రగడ్డ వెంకటేశ్వరరావు హాజరయ్యారు.

# ఆయుస్సుహోమం

మా దంపతుల్ని అక్కడే కూర్చోబెట్టి, అగ్ని హోత్ర వేదిక వద్ద మా అబ్బాయి దంపతులను కూర్చో బెట్టి వారిద్దరితో హోమం విధి విధానంగా చేయించారు హోమద్రవ్యాలను పళ్ళెం లో పెట్టి మా చేత తాకించి వారిద్దరికీ ఇస్తే వాళ్ళు హోమం చేశారు మంత్ర పురస్సరంగా. దాదాపు రెండు గంటలు హోమం వివిధ ద్రవ్యాలతో సాగింది. ఆతర్వాత మా ఇద్దరి చేత పూర్ణాహుతి సామాను ఉన్న పట్టు వస్త్రం మూటను మంత్రాలు చదువుతూ అగ్ని హోత్రునికి సమర్పింప జేశారు. పవిత్ర హోమ భస్మాన్ని మా నుదుట  పెట్టారు. అగ్ని హోత్రం చుట్టూ ముమ్మారు ప్రదక్షిణ చేయించారు.

హోమం జరుగుతుండగానే పామర్రు హైస్కూల్ 86-87 టెన్త్ క్లాస్ బ్యాచ్ విద్యార్ధినులు శ్రీమతి శైలజ, శ్రీమతి లలిత వచ్చి మా ఇద్దరికి శాలువాలు కప్పి సన్మానించి, ఆదివారం జరిగే, “రీయూనియన్” కు మా దంపతులను ఆహ్వానించి కారు పంపిస్తాము తప్పక రావలసిందని కోరారు సరే అన్నాం.వారినీ 27కార్యక్రమానికి రమ్మని ఆహ్వానించాం.

హోమం కాగానే మమ్మల్నిద్దర్నీ కుర్చీలపై కూర్చోపెట్టి మా అబ్బాయి దంపతులతో పుష్పమాలలు వేయించి పళ్ళెం కో కాళ్ళు పెట్టించి వైభవంగా పాద పూజ చేయించారు.   మా శ్యామలాదేవి గారు,భవానిగారు, మల్లికామ్బగారు, రాంబాబు దంపతులు మేనల్లుడు శీను మొదలైన అక్కడికి వచ్చిన వారంతా  అల్లాగేపుష్పాలతో  పాద పూజ చేసి నమస్కరించి ఆశీస్సులు అందుకొన్నారు.  మంగళహారతు లిచ్చారు.  హారతి పళ్ళెం పట్టుకొన్న వారందరికీ తలొక అయిదు వందలు కానుకగా ఇచ్చాం. మా ఇంటి ఆడపడుచులుగా భావించే భవానిగారికి, మల్లికంబగారికి రెండేసి వేలు ఈ శుభ సందర్భంగా అంద జేశాం. పూజారి మురళి సహాయకులు శ్రీ బలరాం గారికి, హోమానికి సహకరించిన చిన్మయగారి తమ్ముడికి బడ్డీ కొట్టు వృద్ధ దంపతులు, మా

పెరట్లో పూలు, తమల పాకులు కోసి స్వామి పూజకు అందించే శ్రీమతి దుర్గ, కంపౌండర్ శివ, కు రెండేసి వేలు, వాటర్ ప్లాంట్ లో పని చేస్తున్న శ్రీమతి సుబ్బమ్మ, పని మనిషి కి వెయ్యేసి రూపాయలు ఇచ్చాం. వంశీ కృష్ణమాచార్యులు వేదాశీస్సులు పలికి ఈ కార్యక్రమ విశేషాలు తెలియజేశాడు. శ్యామలాదేవి గారు కూడా మాట్లాడి ఉత్సాహం కలిగించారు. నేను ఇదంతా మాస్వామి అనుగ్రహమే తప్ప వేరే ఏమీ లేదని 27 న లైబ్రరీలో జరిగే సరసభారతి సాహితీ పుష్కరోత్సవానికి అందర్నీ రమ్మని ఆహ్వానించాను.

దాదాపుగా వచ్చిన వారంతా మాకు నూతనవస్త్రాలు సమర్పించారు. విజయవాడ నుంచి శ్రీ మతి కోసేరు కల్పన గారు కుమారుడు మనవాడి తో వచ్చి మాకు నూతన వస్త్రాలు అందించారు. దాదాపు 60 ఏళ్ళనాటి శిష్యుడు సోమయాజుల మురళీ కృష్ణ చీరాలనుంచి వచ్చాడు. చాలా ఆనందించాం.వాడు నావద్ద ట్యూషన్ కూడా చదివాడు. అలాగే మా కోడలు రాణి మనవడు చరణ్, సదాశివ దంపతులు, వేణు దంపతులు రమేష్ దంపతులు అతని తల్లిగారు, గీతామందిరం ఆంటీ, కుమార్తె, హనుమంతు, ఆంజనేయులు దంపతులు, గంగాధరరావు గారు జర్నలిస్ట్ వీడియోగ్రాఫర్ ప్రకాష్ దంపతులు చాలా ఆనందంగా పాల్గొని వస్త్రాలు ఇందజేశారు. శ్రీమతి రాజీవి దంపతులు కూడా వచ్చి వస్త్రాలు సమర్పించారు. ఒక గొప్ప పండగ వాతావరణం కలిపించారు ఇంతమంది రావటం వలన. తమ ఇంట్లో పండగ గా అందరూ భావించారు. సహస్ర చంద్ర మాసోత్సవం జరుపుకొన్న వృద్ధ దంపతులు సాక్షాత్తు, “ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులే, “అని వంశీ కృష్ణ చెప్పిన మాట అందరికి బాగా, “కనెక్ట్” అయింది. మేమూ నవగ్రహపూజా హోమం చేయించిన వారిద్దరికీనూతనవస్త్రాలు దక్షణ తాంబూలాలు సమర్పించాం. అలాగే మాఆలయ అర్చకుడు మురళి, బలరాం గారు, చిన్మయ తమ్ముడు దంపతులకు దాదాపు అందరికి నూతన వస్త్రాలు అందించాం. ఇదంతా సందడే సందడిగా మహోత్సాహంగా జరిగింది.

ఆతర్వాత ఆలయం ప్రాంగణం లో అందరికి షడ్రశోపేతమైన విందు ఏర్పాటు చేశాం. పదార్ధాలన్నీ మహా రుచికరంగా ఉన్నాయని మెచ్చుకొంటూ అందరూ భోజనం చేయటం మాకు మహదానందంగా మహా సంతృప్తిగా ఉంది. పూజారి బలరాం గారు వంశీ, అతనితో వచ్చిన ఆతను కూడా హాయిగా నేలమీదే కూర్చుని కమ్మగా భోజనం చేయటం నయనానంద కారకం. రమేష్ భార్య, గీతా త మందిరం ఆంటీ గారి అమ్మాయి, గంగాధరరావు. చంద్ర శేఖరరావు గారు దంపతులు బఫే వడ్డన కు బగా సహకరించారు. ఇంతమంది ని ఇన్వాల్వ్ చేసిన ఘనత మా రమణ దే. మేమూ భోజనాలు చేసి మాకు పెట్టిన బట్టలన్నీ మూట కట్టుకొని,కారులో ఇంటికి చేరే సరికి మధ్యాహ్నం 2-30 అయింది. ఫోటోలు పంపి కాసేపు విశ్రమించాం

సరిగ్గా 3-30కు బెజవాడ నుండి మాకు అత్యంత ప్రియమైన శిష్యుడు రెండేళ్ళ క్రితం మరణించిన మేమంతా, “కాళీ ప్రసాద్, “అంటూ ప్రేమగా పిలిచే వంగవేటి కాళీ వరప్రసాద్ కుమారులిద్దరూ వచ్చి, మా ఇద్దరికీ నూత్న వస్త్రాలు సమర్పించి ఆశీస్సులు అందుకొని తండ్రి వారసత్వాన్ని నిలబెట్టుకొన్నారు. వాళ్ళ చెల్లెలు శ్రీమతి వల్లీ రమా పరమేశ్వరిని 27 న జరిగే కవిసమ్మేళనానికి రమ్మని ఆహ్వానించాం. తప్పక వస్తుందని చెప్పారు.

సాయంత్రం, “నా దారితీరు, “ప్రత్యక్ష ప్రసారం మామూలుగానే చేశాను. మిగిలిన విషయాలు మరో ఎపిసోడ్ లో తెలియ జేస్తాను.

పామర్రు లో పూర్వ విద్యార్ధుల సమావేశం 20వ తేదీ సోమవారం మా దేవాలయం లో సహస్ర చంద్ర మాసోత్సవం ఘనంగా జరిగాక, రెండు మూడు రోజుల తర్వాత మల్లికాంబ గారు మా ఇంటికి వచ్చి, మా ఇద్దరికీ బట్టలు పెట్టి వెళ్ళారు.

# పామర్రు లో పూర్వ విద్యార్ధుల సమావేశం

26-6-22 ఆదివారం ఉదయమే పామర్రు స్టూడెంట్ కనకదుర్గ ఫోన్ చేసి మా కోసం కారు ఉదయం 8-30కే వస్తుందని చెప్పి, రెడీ గా ఉండమన్నది. సరే అని మాకు తోడుగా మా అన్నయ్యగారబ్బాయి రాంబాబు వస్తానంటే వాడినీ రమ్మన్నాము. ఉదయమే కాలకృత్యాలు స్నాన సంధ్యావందన పూజాదికాలు పూర్తీ చేసుకొని సిద్ధంగా ఉన్నాం. కారు సమయానికే వచ్చింది. అప్పటికే మా శ్రీమతి తనకోసం అన్నం, కొద్దిగా కూరా వండుకొని ఒక బాక్స్ లో పెట్టుకొని సిద్ధంగా ఉంది. మా కోడలు రాణి పంపిన టిఫిన్ తిని కారు ఎక్కి పామర్రు కు 9-15కు చేరాం. పూర్వ విద్యార్ధులు గౌరవంగా ఆత్మీయంగా ఆహ్వానం పలికారు. అక్కడ శ్రీ కన్యకా పరమేశ్వరి అమ్మవారి దర్శనం చేసి, ఫంక్షన్ హాల్ కింద స్టూడెంట్స్ ఏర్పాటు చేసిన టిఫిన్ పొంగల్, ఇడ్లీ గారే తిని, కాఫీ తాగాం. రుచిగానే ఉన్నాయి. శ్రీమతి శైలజ, లలితా మొదలైన స్టూడెంట్స్చరు తెలీడుకాని తెల్ల బట్టలతో నెహ్రు కోటు వేసుకొన్న ఆటను, నుదుట కుంకుమ బొట్టు పెట్టుకోన్నతను గ్లాడ్ స్టన్ మొదలైన ఆ నాటి విద్యార్ధులు-ఇప్పుడు యాభైఏళ్ళు దాటి పిల్లాపాపలతో మనుమడు మనుమరాళ్ళతో ఉన్న వారు మమ్మల్ని పైన ఉన్న ఫంక్షన్ హాల్ లోకి తీసుకు వెళ్లి కూర్చో పెట్టారు. అక్కడ వేదిక అలంకరణ ముచ్చటగా ఉన్నాయి. ఇక్కడే మూడేళ్లక్రితం 85-86 బ్యాచ్ వాళ్ళ సమ్మేళనం లో పాల్గొన్న జ్ఞాపకం వచ్చింది. విద్యార్ధులందరూ వచ్చేసరికి ఆలస్యమై కార్యక్రమం ఉదయం 11 గంటలకు ప్రారంభమైంది. ఈలోగా పాత విద్యార్దినీ విద్యార్ధులు నా దగ్గరకొచ్చి పేరు చెప్పి పరిచయం చేసుకొని ఏ సెక్షన్ లో ఉండేవారో చెప్పుకొన్నారు.

ముందుగా నన్ను వేదికపైకి ఆహ్వానించారు. తర్వాత 94ఏళ్ళ వృద్ధులు డ్రిల్ మాస్టర్ పద్దారెడ్డి అని పిలువబడేశ్రీ గుజవర్తి పద్మా రెడ్డి గారిని, తర్వాత క్రాఫ్ట్ మాస్టర్ ప్రకాశరావు, నేచురల్ సైన్స్ టీచర్ శ్రీమతి కస్తూరి, హిందీ పండిట్ శ్రీమతి సీతా మహాలక్ష్మి, గుమాస్తా వీరయ్యలను ఆహ్వానించి అందరికి పుష్పగుచ్ఛా లిచ్చి కూర్చోబెట్టారు. తర్వాత జ్యోతి వెలిగించే కార్యక్రమం నన్ను ముందు చేయమంటే, నా కంటే పెద్దవారు రెడ్డి గారి తో చేయించాను. తరువాత నేనూ చేసి, మిగిలిన వారితో చేయించాను. ఒక కుర్రాడు అంతకు ముందే శంకర మహదేవన్ హిట్ సాంగ్, "గణనాయకం, " మరోపాట శ్రావ్యంగా గానం చేసి సభ కు నాంది పలికాడు. అతన్ని మరో శంకర్ మహదేవన్ అని మెచ్చాను. చనిపోయిన పూర్వ విద్యార్ధులకు ఉపాధ్యాయులలకు అందరం నిలబడి రెండు నిమిషాలు వారి ఆత్మా శాంతికి మౌనం పాటించి గౌరవించాం.

సెక్షన్ వారీగా ముందు ఆడపిల్లలను తర్వాత మగ పిల్లలను వేదికపైకి పిలిచి వారితో పరిచయ వాక్యాలు, ఇప్పుడు ఏం చేస్తున్నారు పిల్లల వివరాలతో సహా చెప్పించారు. మొత్తం అయిదు సెక్షన్లు. నేను ఉయ్యూరు నుంచి సుమారు పది రకాల సరసభారతి పుస్తకాలు సుమారు 150 తీసుకు వచ్చి వేదికమీదనే ఆ విద్యార్ధులందరికీ నా చేతులమీద అందించాను. కొందరు స్టూడెంట్స్, "మాస్టారు ఈ పుస్తకాలలో మాకు ఎక్సాం పెడతారా ?""అని జోకేస్తే, "ఆన్ లైన్ ఎక్సాం, "అని నేను నవ్వుతూ అన్నాను. అందరికి సరస్వతీ ప్రసాదంగా సరసభారతి పుస్తకాలు అందించిన సంతృప్తి పొందాను. నేను పని చేసినప్పుడు లెక్కలమేష్టారుగా గున్న శ్రీ గండ్రం వెంకటేశ్వరరావు గారమ్మాయి శ్రీమతి ప్రసూన. భార్యాభర్తలు హిందీ మేష్టర్లుగా పని చేసినశ్రీ యద్దన పూడి ప్రభాకరరావు, శ్రీ మతి రాజేశ్వరి దంపతుల కుమార్తె శ్రీమతి కనకదుర్గ, హిందీ మున్షి గారమ్మాయి, కృష్ణా ఫాన్సీ షాప్ వారమ్మాయి చాల ఆప్యాయంగా దగ్గరకు వచ్చి పరిచయం చేసుకొని ఫోటోలు దిగారు. ఆరగా ఆరగా కాఫీలు డ్రింకులు ఇస్తూనే ఉన్నారు, తాగుతూనే ఉన్నా.

ప్రత్యేక ఆసనం పై మా దంపతుల్ని కూర్చోపెట్టి, నూత్న వస్త్రాలతో పుష్పహారాలతో శాలువాలతో, సత్కరిస్తూ. మాగురించి పరిచయాలు చేస్తూ, పాదాలపై పూలు చల్లుతూ, ఇద్దరికీ చెరొక బాగ్,జ్ఞాపిక ఇచ్చి చాలా వినయ విధేయతలతో గౌరవ ఆత్మీయతలతో సన్మానం చేశారు. ఇలాగేమిగిలిన వారికీ మర్యాద చేస్తూ వారితో మాట్లాడించారు. చివరికి నేను మాట్లాడుతూ, "ఇంత ఉత్సాహం వినయ విధేయతలు భక్తీ శ్రద్ధలతో ఆదరణతో చేసిన ఈఅపూర్వ సత్కారం వలన మా వయసు ఇరవై ముప్పై ఏళ్ళు తగ్గింది అని పించింది అందరుమీ కుటుంబాలతో ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలి రేపు 27వ తేది సోమవారం ఉయ్యూరులో 165వ కార్యక్రమగా జరిగే సరసభారతి సాహితీ పుష్కరోత్సవానికి మీకందరికీ ఇదే ఆహ్వానం, "అని ముగించాను. తర్వాత సెక్షన్ వారిగా ఆతర్వాత మొత్తం గ్రూపు ఫోటోలు తీయించుకోవటం తో సభ ముగిసింది.

తర్వాత అనేక పదార్ధాలతో విందు ఏర్పాటు చేశారు. మా శ్రీమతి తానూ ఉయ్యూరు నుంచి తెచ్చుకొన్న బాక్స్ లో అన్నం ఇక్కడి తనకు నచ్చిన ఒకటి రెండు పదార్ధాలతో భోజనం చేస్తే నేను స్వీట్లు, పప్పు అన్నం సాంబారు పెరుగుతో భోజనం ముగించాను. తర్వాత ఐస్ క్రీంలు, కమ్మని కిళ్ళీ లు కూడా ఇచ్చారు. రెండు ఐస్ క్రీమ్స్ తిని, రెండు కిళ్ళీలు నమిలాను. మమ్మల్ని మళ్ళీ కారులో కూర్చోపెట్టి విద్యార్ధులంతా నమస్కారాలు చేస్తూ ఘనమైన వీడ్కోలు పలికారు. మనసంతా ఆనందపు హాయి అనుభవించినట్లుంది ఈఅపూర్వ కలయిక.

మా వెనక కారులో శ్రీమతి కస్తూరి, శ్రీమతి సీతామహాలక్ష్మి గార్లు ఉయ్యూరు లో మ ఇంటికి వచ్చారు. మా ఇద్దరికీ కస్తూరి గారు నూతనవస్త్రాలు పూలు పండ్లు అందించి తాను రాసిన కవిత చదివి వినిపించారు. లక్ష్మి గారు పండ్లు అందజేశారు. వారిద్దరికీ మా శ్రీమతి సాంప్రదాయబద్ధంగా చీరా సారే పెట్టి గౌరవించింది. ఫోటోలు దిగాం. వారిద్దరిని గౌరవంగా సాగనంపాం. ఇలా ఆదివారమంతాపూర్వ విద్యార్ధు లతో, ఆనాడు నాతో పనిచేసిన ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులతో హాయిగా ఆనందంగా సందడే సందడి గా గడిచి పోయింది. తర్వాత ఎపిసోడ్ లో 27వ తేదీ సందడి రాస్తా.

**వారం రోజులు సందడే సందడి చివరగా**

ఈ సందడి లోపు జూన్ 5 ఆదివారం మా మనవడు చరణ్ ఉపనయనం అయిన 16 రోజుల పండుగనాడు మా శ్రీ సువర్చలాన్జనేయ స్వామి దేవాలయం లో మేమిద్దరం వెళ్లి ఉదయం ప్రత్యేక పూజ చేయించి చక్రపొంగలి పులిహోర ప్రసాదాలు చేయించి నైవేద్యం పెట్టించాము.అలాగే జూన్ 18 శనివారం మా అమ్మాయి చి. సౌ. విజయలక్ష్మి, అల్లుడు శ్రీ సాంబావధాని గార్ల 29 వ మారేజీ డే సందర్భంగా నేను మనవడు అబ్బాయి రమణ ఉదయం వెళ్లి శ్రీ సువర్చలాన్జనేయ స్వామికి ప్రత్యేక పూజ చేయించి, స్వామికి గారెల దండ వేయించాం. ఆతర్వాత అల్లుడు ఒక 15 రోజులు ఇండియాలో గడపటానికి అమెరికా నుంచి వచ్చి, వొత్తిడి పనుల్లో బిజీ గా ఉంటూ కొన్ని గంటలు ఉయ్యూరులో మాబ్బాయి జాగృతిఆఫీస్ లో, మా ఇంట్లో ఒక అరగంట ఉండి మర్నాడు కాకినాడ వెళ్లి, ఆతర్వాత అమెరికాలోని షార్లెట్ కు జూన్ 27 చేరాడు.

జూన్ 27 న ఉదయాన్నే లేచి అన్ని పనులు పూర్తి చేసి స్నాన సంధ్యా పూజాదికాలు పూర్తీ చేశాను. ప్పటికే బదరీనాద్ గారి కుటుంబం షిర్డీ నుంచి ఉయ్యూరు వస్తే హోటల్ లో రూమ్ బుక్ చేసి ఉంచాం. మా అబ్బాయి శర్మ, మనవడు హర్ష ఉదయం 8కి వచ్చారు. సుమారు ఉదయం 9 కి శ్రీ కెవి సుబ్రహ్మణ్యమ గారు ఫ్లైట్ లో దిగి మా ఇంటికి పాలపర్తి (మద్దెల) వెంకట్రామయ్య గారబ్బాయితో వచ్చి మా ఇద్దరికీ నూతనవస్త్రాలు అందించి ఆశీస్సులు పొందారు. భోజనానికి రమ్మంటే ముందే పాలపర్తి వారింట్లో బుక్కయ్యానన్నారు. కాసేపట్లో శ్రీ మతి భవానీ, శ్రీ రాంబాబు దంపతులు వచ్చి మా ఇద్దరికీ పళ్ళతో సహా బట్టలు పెట్టి ఆశీస్సు లందుకొన్నారు. మా అన్నయ్యగారబ్బాయి రాంబాబు వచ్చి శుభా కాంక్షలు తెలిపి స్వీట్ పాకెట్ ఇచ్చాడు. ఆ తర్వాత బదరీ దంపతులు వారితో వచ్చిన మరొక ఆవిడ శ్రీమతి సాయి సుబ్రహ్మణ్యేశ్వరి మా ఆహ్వానం పై మా ఇంటికి వచ్చారు. వీరికి సరసభారతి పుస్తకాలు ఒక 25 ఇచ్చాము. వారిద్దరికీ జాకెట్లు పసుపు కుంకుమ తాంబూలాలు ఇచ్చండి మా ఆవిడ. సాయి గారికి గబ్బిట వారితో, గాడేపల్లి వారితో బంధుత్వం ఉంది. కాసేపట్లో హైదరాబాద్ నుంచి బెజవాడవచ్చి కనకదుర్గ అమ్మ వారిని, మాచవరం శ్రీ ఆంజనేయస్వామి వారిని దర్శించుకొని ఛి గాడేపల్లి రామ కృష్ణారావు శ్రీమతి వల్లి దంపతులు వచ్చారు. ఈదంపతులు మాకు నూతన వస్త్రాలు అందిస్తే, ఆమెకు మా శ్రీమతి చీర జాకెట్, వగైరా ఇచ్చి ఆమె అత్తగారు శ్రీమతి శాంతమ్మ(మా రెండవ బావగారు శ్రీ వివేకానంద్ గారి చెల్లెలు )గారికీ చీర జాకెట్ అందజేయమని ఇచ్చింది. ఇక్కడికి వచ్చిన వారంతా ఒకరికొకరు బంధువులే కాని ఇక్కడే మొదటిసారి చూసుకోవటం. వీరి తర్వాత జాగృతి సంస్థ కు చెందిన శ్రీమతి రాజీవి, స్టాఫ్ నాకు ఇష్టమైన మైసూర్ పాక్ ను మా కోడలు మహేశ్వరి చేస్తే తీసుకువచ్చిందరికి పెట్టి, మాకు నమస్కారాలు చేసి ఆశీర్వాదాలు పొందారు. తిధులప్రకారం నా పుట్టినరోజు నాడు మా అమ్మ తప్పకుండా మైసూర్ పాక్ చేసి పెట్టేది. తర్వాత మాఆవిడా చేస్తోంది. కానీ మొన్న 20 వ తేదీ పనుల వత్తిడి వలనా, అలసట వలన చేయలేకపోయింది. ఇవాళ ఉదయమే

ఆరింటికే చేసి నాతో దేవుడికి నైవేద్యం పెట్టించి, అందరికి తినిపించింది. మల్లికాంబ గారుకూడా మా కోరిక పై వచ్చారు. ఇంతమంది మా ఇంట్లో అతిధులు రావటం మాకు పరమానందంగా ఉంది. మా ఆవిడ పొంగి పోయి పరవశం చెందింది..

అందరికి మా పై అంతస్తు హాలు లో భోజనాలు ఏర్పాటు చేశాం. కూర్చోగలిగిన వారు కింద, లేని వారు కుర్చీలలో కూర్చుని భోజనం చేశారు. మామిడికాయపప్పు వంకాయ కూర సొరకాయ కూటు,ముక్కల ఆవకాయ, పులిహోర సాంబారు పెరుగు వగైరాలతో భోజనం. అందరూ తృప్తిగా భోజనం చేశారు. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. 2014 సరసభారతి ఉగాది వేడుకలకు ప్రపంచ ప్రసిద్ధ ఈల విద్వాంసులు శ్రీ కొమరవోలు శివ ప్రసాద్ గారిని ఆహ్వానించి రెండు గంటలు రోటరీ ఆడిటోరియం లో కచేరీ చేయించాం. ఆయన తో 6 గురు వచ్చారు. వారందరికీ మా ఇంట్లోనే భోజనం. మా హాల్ లోనే డైనింగ్ బల్లలు కుర్చీలు వేసి భోజనం పెట్టాం. వంట అంతా మా ఆవిడ అమెరికానుంచి వచ్చిన మా అమ్మాయి, చేశారు మా ఇద్దరబ్బాయిలు కోడళ్ళు హైదరాబాద్ నుంచి పిల్లలతో సహ వచ్చారు. ఇలా భోజనాలు వండి వడ్డించి పెట్టటం మా ఆవిడకు చాలా ఇష్టం. ఆ తర్వాత ఉగాదులకు శ్రీ రామడుగు వెంకటేశ్వర శర్మ, శ్రీ చక్రాల రాజారావు గారు కుటుంబం, శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు శిష్యుడు, వీరితో పాటు వచ్చిన ఆవిడశ్రీమతి కమలాకర్ భారతి, ఆతర్వాత శ్రీ రామయ్య గారి పుస్తకావిష్కరణకు హైదరాబాద్ నుంచి వచ్చిన ఆయన బావమరది, భార్య లకు కూడా ఇలాగె పగలు మా ఇంట్లోనే విందు ఏర్పాటుచేశాం. ఇలాంటి వాటికి మా ఇంటి ఆడపడుచు లాంటి మల్లికాంబగారు వచ్చి మాకు గొప్ప సహకారమందిస్తారు. అలాగే శివలక్ష్మి దంపతులు కుమార్తె బిందు కూడా. ఈసారికూడా ఆవిడా, మాకోడళ్లు రాణి,మహేశ్వరి తణుకావిడా, వల్లీ వడ్డన లో చక్కని సహకారం అందించారు.

మేము భోజనాలు చేసి కిందకు దిగేసరికి గుంటూరు నుంచి డా. మైలవరపు లలిత కుమారి శ్రీ రామ శేషు దంపతులు, కుమారి గారి తల్లిగారు వచ్చారు. ఆహ్వానం పలికి వారు భోజనం చేసి వచ్చామని చెబితే, వారికీ స్వీటు పులిహోర పెట్టి సంతృప్తి చెందాం. లలితకుమారి దంపతులు మా ఇద్దరికీ నూతన వస్త్రాలు అందించి ఇటీవలే ఆమె రంగనాధ రామాయణం రాసి,ఆవిష్కరింపజేసిన పుస్తకం ఇచ్చారు. నా, "సాహితీ ఫాన్ రామ శేషు గారికి నేను శాలువా కప్పిసత్కరిస్తే,, మా శ్రీమతి ఆయన అత్తగారికి చీరే జాకెట్ పెట్టగా ఇద్దరం ఆమెగారికి నమస్కరించి ఆశీస్సులు పొందాం.అప్పటికే సమయం రెండు దాటగా అందరికి కాఫీ ఇచ్చే ఏర్పాటు చేశాం. రాంబాబు భార్య వల్లి ఈ పని చక్కగా చేసి సంతోషం కలిగించింది. ఈలోపు ఫోన్లలో మెసేజ్ లద్వారా శుభా కాంక్షల వర్షం కురుస్తూనే ఉంది నేను మధ్యాహ్నం 3కు టిప్ టాప్ గా తయారై కారులో లైబ్రరీదగ్గరున్న ఫంక్షన్ జరిగే రాజుగారి బిల్డింగ్ దగ్గరకు చేరుకొన్నాను. ఇంటి దగ్గర భవానిగార్కి, మల్లికామ్బగారికి, మనోహరి గరికి మా శ్రీమతి చీరా సారే పెట్టి నెమ్మదిగా అందరితో కలిసి కోడళ్ళతో సభకు వచ్చింది, ఇంత మంది సహృదయుల శుభా కాంక్షలు, ఆశీస్సులతో మేము , "సరసభారతి సాహితీ పుష్కరోత్సవ సభకు చేరుకొన్నాం, "అక్కడ బ్రహ్మర్షి వంటి అన్నదానం వారల, అవధానుల, కవి పండితుల పద్య, కవితా శీస్సులతో, మంచిమాటలతో అక్కడకూడా పురస్కార గ్రహీతలు మమ్మల్ని సత్కరించి ఆశీస్సులు పొందటం తో ఆనందం తో సంతృప్తి తో తడిసి ముద్దయ్యాం. ఈ అనుభవం గొప్పది. ఇంతకంటే మహదానందం ఉండదు. సభకు శ్రీ పూర్ణచంద్ గారు వచ్చి నాకు తన, "పూర్ణ చంద్రోదయం, "ఇవ్వటంతో నాకు సాహితీ శక్తి సామర్ధ్యాలు పెరిగినట్లయింది., " పద్మ భూషణ్ గుర్రం జాషువా స్మారకకలా పరిషత్ –దుగ్గిరాల నిర్వాహకులు డా పి.యోహాన్ గారు విచ్చేసి సంస్థ తరపున ప్రచురించిన, "రజతోత్సవ ప్రత్యేక సంచికను, "అందించి ఈసారి జాషువా పురస్కారం నాకు అండ జేయబోతున్నట్లు వేదికపై ప్రకటించటం అశ్వగంధ, చ్యవన ప్రాస సేవించిన ఆనందాను భూతి కలిగింది. వారికి మేము చేసిన సత్కారాన్ని స్వీకరించినందుకు ధన్యవాదాలు ఇంతకంటే ఎక్కువ రాస్తే మీరు జీర్ణించుకోలేరు. ఇంతగా విశేషంగా మాసహస్ర చంద్ర మాసోత్సవం సరసభారతి 165వ కార్యక్రమగా జరిపిన, "సరసభారతి సాహితీ పుష్కరోత్సవం లకు విచ్చేసి ఆశీర్వ దించి, అభినదించి ఆనందించి, "సందడే సందడిగా, "గా అనుభూతి కలిగించిన వారందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకొంటూ సెలవు తీసుకొంటున్నాను.

## కవి సమ్మేళనం కవితలు

# ధైవతాశీస్సు!

సరస కవిరాజు విద్వాన్ నవులూరి రమేశ్ బాబు, ఉయ్యూరు.

శ్రీ 'సువర్చలాదేవి'తో స్థిరముగాను, పూర్వకాలాన 'నుయ్యూరు' పురమునందు,
'గబ్బిటాన్వయ' పుణ్యంపు గరిమ మహిమ, తెలుప; స్థాపించుకొన్నట్టి దేవ 'హనుమ'
గుణధనమున వెలిగెడు నీ గొప్పవాని, శిష్టు, దుర్గాప్రసాదు నా శిర్వదించు!

వేకువఝామునన్ గడగి వేదవిశేష సుమంత్ర శేముషిన్,
చేకొని 'యాంజనేయుని'కి సేవలుచేసిన పుణ్య భాగ్యమే,
నీ కమనీయ గ్రాత్ర వరణీయమహీయ వదాన్యసూత్రమై
సాకెనటంచు నెంచి, మనసా వచసా నతులన్ వచించెదన్!

గబ్బిట వంశ వర్ధనుడు! గౌరవ 'దుర్గ ప్రసాదు మాస్టరున్',
నిబ్బరమైన ప్రజ్ఞకును, నిర్మలవర్తన మేలుబంతిగాన్,
కబ్బములెన్నొ వ్రాసిన ప్రకాండుడునై, గురుతుల్యుడై,
యబ్బిన విద్యలందఱకు నందగ జూచుట, 'నెంత ధన్యుడో'!

సొగసు నిండార పండిన సోకుగాడు!
నిత్య పరిశుభ్ర సరిదభ్ర నీటుగాడు!
అందరిని కుదిపి కదుపు నాటగాడు!
పొగరు పండించి పెంచె, నీ పోటుగాడు!

వీరి వర్తనకు మత్తకోకిలా కీర్తన!
'నెమ్మదిన్' తన కోశమందున నిల్వజేయని వీరుడున్,
మమ్ము నందరి దుమ్ము దుల్పుచు మారుపల్కగజేయకన్,
సమ్మతంబున వారి వెన్కనె సాగునట్టుల జేయుటన్
యిమ్మహాత్ముని 'యాంజనేయుడె' యెల్లవేళలగాచుతన్!

భవదీయుడు రమేశ్ బాబు

# ఈ పుష్కరోత్సవ వేళ సరసభారతి

కందికొండ రవికిరణ్ విజయవాడ 9491298990
శీర్షిక: కవి హృదయ విపంచికా నాదం

ఇల నలనాటి కాళీ వరప్రసాది
నేడిట దుర్గాప్రసాదుడై
గబ్బిట వంశజుడై
వెలువరించెనేమో శతానేక కవితా కావ్య గ్రంథముల !!!
పెక్కుమంది శిష్యుల నున్నతికి జేర్చిన ఓ గురువా !
అభిమాను లెందరినో మధుర ఫలములుగ కల్గిన ఓ తరువా !
సహస్ర పున్నమి చంద్రుల గాంచిన మహోన్నత కవిపుంగవా !
శుభము లిడుగాక ఆ సర్వేశ్వరుడు మీ దంపతులకు.

ఇంద్రకీలాద్రి మల్లికార్జునుని మానససరోవరానివై
సాహిత్య సరస్వతీ ఆలయ ప్రాంగణ పవిత్ర పుష్కరిణివై
దేశ విదేశ మిత్ర వదాన్య హస్తములు
కలసి వచ్చి కైమోడ్పులు చేయ. ...
పుష్కర కాలముగా శ్రద్ధాసక్తుల తోడ
ఇంపగు సొంపగు కవితా సారస సంపదను
మిక్కిలి రక్ష చేసి సంరక్షణ చేసి. ...
ఉత్సహించు పలువురు మృగనయనల
మృగేంద్రు నేత్రుల కలముల
సాదరముగ ప్రోత్సహిస్తున్న సరస భారతీ!
వర్ధిల్లుమా కలకాలము
శుభకామనలు నీకీ ఉత్సవ శుభవేళ.

# సరస్వతీ సమర్చనం

డా.మైలవరపు లలితకుమారి గుంటూరు. 9959510422.
సరసమైన అక్షరాలపొందికతో
రససమంచితమైన పదాల అల్లికలతో
సహృదయ హృదయాలను వెలిగింపచేస్తూ
భాషా భారతికి సేవలందిస్తూ

రమణీయమైన రచనలతో
తీరైన కావ్యముల ద్వారా
ఎందరోమహానుభావులను
పాఠకలోకానికి పరిచయంచేస్తూ
సరసభారతి సాహితీ సంస్థద్వారా
"తెలుగులో మాట్లాడటం మనజన్మహక్కంటూ"
మాతృభాషను మాతను మరువరాదంటూ
సరస్వతీ సమర్చనం చేస్తున్న
పెద్దలు మాన్యులు శ్రీదుర్గాప్రసాద్ దంపతులు
సహస్రచంద్రదర్శన వేడుకలేకాక
శతవసంతాల పండుగనుజరుపుకోవాలని
వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలను
ప్రసాదించాలని మనసారా
మనసారా ఆ భగవంతుని ప్రార్థిస్తున్నాను.

# వందనములు వంద వంద వేలు

శ్రీమతి సింహాద్రి వాణి-విజయవాడ -7569820872

1-సీ.-దుర్గాప్రసదను దొడ్డ గురువు గారు –ఒజ్జయై వెలుగొందె యోర్పు లోడ

విద్య గరిపి ,కడు విలువలు బోధించి –భావి పౌరులను బాగ దీర్చె

సరసభారతి సంస్థ స్థాపించి ఘనముగా –సాహిత్య సేవను చేయు చుండె

వెలకట్టలేనట్టి విలువైన గ్రంథముల్-రచియించి ప్రచురించె రాజసముగ

ఆ.వె.-పర్వమౌయుగాది పావన దినమున –సభలను జరిపించి శుభము పొంగ

సత్కరించు ఘనుడు సత్కీర్తి వేత్తలన్ –సంతసించు మిగుల శారదాంబ .

2-సీ-ఆయన విలువైన యమితమౌ సేవలన్ –తెలుగు భాష మిగుల వెలుగు చుండె

సంగీత సాహిత్య సభలను జరుపుచూ – సత్కరించు చుండె చక్కగాను

ఎందఱో ప్రముఖుల ఎందరో ఘనులను –గౌరవాదరముల కోరి పిలిచి

పన్నెండు ఏండ్లుగా పరిఢవిల్లుచు మిగుల –సరసభారతి సంస్థ సాగు చుండె

ఆ.వె-దైవ భక్తి కలిగి ,ధార్మిక బాటలో –సాగు చుండెడు కడు శ్లాఘనీయ

మూర్తి కిడుదునేను మోదమొప్పంగగా – వందనములు వంద వంద వేలు.

## సరసభారతీ జయము జయము

డా .గురజాడ రాజ రాజేశ్వరి –మచిలీ పట్నం -9440709939

1-.తేగీ .-  సరసభారతి సాహిత్య సంపదలకు –మాన్యులగు కవి గాయక మణుల తనరె

గబ్బిట వటవృక్షము వృద్ధిగ నగుచుండే-సాహితీ పుష్కరోత్సవ సమయమందు .

2-కం-దుర్గాదేవి కరుణ తోనె-దుర్గమమౌ నేకార్యము దలచిన సాగున్

దుర్గతుల దాటనిజముగ-దుర్గాదేవి అమృతమగు దృక్కుల గాదే.

3-తే.గీ.-సరసభారతి సంగీత సంపదలకు –సాంస్కృతిక కళా గాన విశారదులకు

సాహితీ పురస్కార మసాధ్యముగను –ఆలవాలమై నిలిచెను అబ్బురముగ-సాహితీ పుష్కరోత్సవ సంబరమున .

4-సీ-అధ్యక్షుడగు గబ్బిటకులదీప్తి శిఖల –తేజోవతుల జేసెతండ్రి గనుక

శ్యామలాదేవి యే సమరస భావ దీ-ప్తితోతీర్చి దిద్దే  తృప్తి కలుగ

మాదిరాజు సమర్ధముగకార్యముల్ సల్ప –వెంకట రమణుడు వెన్ను దండు

కోశాదికారియై కరము కీర్తి వహించె-సాహితీ పుష్కరోత్సవము జరుప

తే.గీ .-విబిజి రావు సాంకేతిక విపులమతిని –జేసే భారతి వర్ధిల్లు వేడ్క తోడ

అంజనీ సుతుడు జయము నొంద జేయు –జయమగు సరసభారతీ జయము జయము .

5-తే.గీ.-జయము గబ్బిట చంద్రమా జయముజయము –జయము వాయు సుతుని వేడ జవము కలుగు

పవన సుతుడు సకల లోక పావనుడుగ-వేయి చంద్ర నెలలు బాలు వేగ బ్రోవు ‘’

## ఎవని పలుకు

ఓలేటి ఉమా సరస్వతి –విజయవాడ -9866366457

ఎవని పలుకు విని ఎలమావి కోయిల –యచ్చెరు వందుచు నాలకించు

ఎవని కంఠమునందు నింపుగా వర్ణాలు –స్వరతంత్రులను మీటి వారలు చుండు

ఎవ్వాని వాక్కున నిభనిమీలిక మొప్ప –అవధాన పద్యమై అందగించు

ఏ రాజు లెస్సని ఎంతగా పొగిడెనో –నిలిచి యాపదమే నిక్కమాయె

అదియే తెలుగురా తల్లిగ నాదరించు –అమ్మ పాలతో నొసగిన యక్షరమది

భావనంబు లాకృతి దాల్చి భవిత నొసగు –వారసత్వంముగ నిలుచు వాస్త వ మిది.

# అక్షర లక్షల అక్షరాంజలి

శ్రీ అగ్ని హోత్రం శ్రీ రామ చక్రవర్తి –ఉయ్యూరు –

శ్రీమతి భవానమ్మ మృత్యుంజయ శాస్త్రి గారాల ముద్దు బిడ్డ –సాహిత్య లోకం గర్వించ దగిన తెలుగు బిడ్డ

సరసభారతి నిర్వహణలో బహుదొడ్డ – మురిసి పోతుంది నిను చూసి ఉయ్యూరు గడ్డ

అతి సున్నితమై న మీ మనస్సు –సాహిత్యతపస్సుపై గురి పెట్టిన ధనుస్సు

సాహిత్య ప్రియుల మదిలో నవ ఉషస్సు –ఫలియించింది మీ జీవన తపస్సు

సరసభారతి చక్కని వేదికై –చదువుల తల్లి మీ ఆడ పడుచై

స్వీయ రచనలు ఇరువది యారై-స్వీయ సంపాదకత్వం లో పదహారు గ్రంథాలను

సరసభారతి ద్వారా సాహితీ ప్రియులకు అందించిన కృషి వెల కట్టలేనిది

మీరు పైకి మాత్రం సామాన్యులు –అన్ని విషయాలలో అసామాన్యులు

ఆచరణలో అయ్యారు ధన్యులు –అందుకే మీరు మహామాన్యులు

మీరు అజాత శత్రువు అనిపించుకొన్న వ్యక్తి –అందరినీ కలుపుకు పోయే సంఘటిత శక్తి

సాహిత్యోద్యమంలో అనురక్తి –కర్తవ్య నిర్వహణలో మరీ ఆసక్తి

సాహిత్య లోకానికి అందించిన సహకారం –బంధు మిత్రులకు పంచిన మమకారం

మీ విజ్ఞాన విజ్ఞతలకు చుట్టిన శ్రీకారం –అది మీ హృదయ సంస్కారం

మీరు వేసిన అడుగులు రోజులు నెలలు సంవత్సరాలు దాటి –నేడు సహస్ర చంద్ర దర్శనం చేశారు

శ్రీ సువర్చలాఞ్జనేయుడు మిమ్మల్ని దీవించాడు –అందుకోండి మా అక్షరాంజలి .

# వందనము వందనము

కస్తూరి

మా ప్రభావతీ మాతా సమేత విశ్రాంత యశో భి రాములకు

**వందనము వందనము** చిక్కని సుధలు చేర్చిన ఉదాత్త వృత్తంబు లందించు సాహితీ శరశ్చంద్రులకు

**వందనము వందనము** హృద యైక వైద్యంబైన విజ్ఞాన సార సుధా ఝురీ మధుర మ్ము ల విశ్లేషణమ్ముల కు

**వందనము వందనము** భక్తి భావము జేర్చి మంగళం బు వార మందించు శ్రీ సువర్చలా ఆంజనేయ స్వామి పా దాంబుజమ్ముల దివ్య దర్శనంబునకు

**వందనము వందనము సరస భారతీ** సాహితీ సరస్సు వెలయించి

రసభరిత దాడిమీ ఫలమ్ము లను బోలు నవ దీప్తుల సాహిత్య మందించు బంగారు పద్మానికి

**వందనము వందనము** వెలుగులు వెలార్చేటి మా పురా విజ్ఞాన వైభవానంద వసం తం బు పరిమళాలతో

మమ్ము మమ్ము ముంచె త్తు మా సరస భారతీ తోట మాలికి

**వందనము వందనము వందనము**

అన్నింట మీవెంట వెన్నంటి యుండి మహలక్ష్మి లా మీకైదండ నిలిచి

విజ్ఞాన సుందరీ అలిక ఫలకాన కనక కాంతులు చిమ్మేటి

కళ్యాణ తి లకమ్ము లా మిమ్ము మాకందించిన పూజ్య ప్రభావతీ

అమ్మకు

మీ ఆది దంపతుల కు పాదా భి వందనము ల తో ---కస్తూరి

# వార్ధక్య యవ్వనం –యవ్వన వార్ధక్యం

శ్రీ తుమ్మోజు రామ లక్ష్మణాచార్యులు విజయవాడ 9703776650

**వార్ధక్య యవ్వనం –యవ్వన వార్ధక్యం**

1-కం-శ్రీకర మీ సభ తెలుగున-కీ కరణి వెలుగు పంచి కేతన మెత్తిన్-మా కొలది పండితాళిని-వే కొలది పిలిచి కొలచెను వెలగు జేజెల్ .

2-ఉ-ద్వాదశ వర్షముల్ సరసభారతికింపుగ నిండుటల్ మదిన్ –వారని పులకలు పొడము –భారతి తెలుగు వెలుంగు లం దిశల్

సారస బాసురంబవగ చాటెను నియ్యెడ నుర్వరా పురీ –భారతి వేది నుండియల పశ్చిమ దిక్తట ‘’షార్లేటందు’’నన్ .

3-చం-ఆతడొక నిత్య యౌవనుడు ,స్వార్జిత కీర్తి ప్రభావతీ యుతుం –డతడొక భవ్య సేవకు డనారత మధ్యయనంబు సల్పుచున్

సతతము వ్రాయు చుండు కాదు చక్కని గ్రంథము లెన్ని యోనొకోన్ –అతని కతండే సాటి యిల నాంధ్ర సరస్వతి పాద సేవలో .

4-సీ-పదు రెండు వర్షాల ప్రాయంపు వృద్ధ యీ-సరసభారతి బహు సరస గాత్రి

సంగీతసాహిత్య శృంగారముల వన్నె –లెన్నెన్ని పొందెనో చిన్నిబాల

యెనుబదేండ్ల యువకు డీ గబ్బిటాన్వయ –దుర్గాప్రసాదు సద్గుణ  విరాజి

పదుల కొలది వ్రాసె ప్రామాణ్య గ్రంథాలు –పది యేండ్ల వ్యవధిలో పవలు రేలు

తేగీ-సరసభారతి నొక్కడై చతుర మతిని –సభల రప్పించి ప్రముఖుల శతము పైన

దిగ్విజయముగజరిపిన దీక్షితుండు –వేయి చంద్రుల జూచిన వేగు చుక్క .

5-సీ-ఎన్నెన్ని పద్యాలు ఇంపార  నా చేత –వ్రాయించి చదివించెరక్తి నిచట

ఎన్నెన్ని కావ్యాలు నన్నెంతో చదివించి –చెప్పించె నా చేత చిత్తమలర

తప్పటడుగుల వాని గొప్పగా నడిపించి –పరువు లెత్తుట నేర్పెపరమ ప్రేమ

కలము గళము లందు కొలువౌచు నడిపించె-సరసభారతి నన్ను సరస లీల

ఘన ‘’సువర్చలా వాయు నందన శతకము ‘’-సంస్కృతిని వ్రాయగంటిని సరసభార

తే ప్రచోదనమున నేను ప్రణుతుల –జేతుసరసభారతికి చిత్తమలర.

6-బ్లాగులందున ,ఫేసు బుక్కున రసయుతంబుగ సరసభారతి –తరగ లెత్తుచు నురక లెత్తుచుపులకరింపుల పలకరింపై

విషయ కూలంకష ము నొచు ధిషణకే పదునెట్టితానై –ఉరుకు లెత్తుచు సాగు గావుత తీగ వోలె ఆగకుండ.

# భారతీప్రసాదము

అవధాన బాల భాస్కర, అష్టావధాని భరత్ శర్మ ఉప్పలధడియం తిరుపతి 8247828200

**భారతీప్రసాదము**

తే.గీ.
సరసభారతి పుష్కరోత్సవ సమయము
సత్కవివరులకెల్ల నుత్సాహకరము
సాహితీ రసరమ్య చర్చల స్థలమ్ము
భారతికి నెలవైన యుయ్యూరు పురము. (1)

తే.గీ.
సరస భారతి రథమున సారధివలె,
పండితులకు విజయమును బంచినారు
దీక్ష బూనుటలో మారుతిగ దనర్చి
సాఁగు గబ్బిట దుర్గాప్రసాద! ప్రణతి. (2)

కం.
తేనెయు చక్కెర కలసిన
పానకమును పోలునట్టి పాండిత్యమ్మున్
కానగ నాంధ్రమ్మును, వి
జ్ఞానపు శాస్త్రముల నేర్పు గడియించిరిలన్. (3)

కం.
అబ్బిన విద్యల తోడన్
నిబ్బరముగ సేవ చేసి నిరతము క్రియలన్
అబ్బుర మందగ జేసెడి

గబ్బిట దుర్గాప్రసాద కవివర ప్రణతుల్ ! (4)

సీ.
విజ్ఞాన శాస్త్రమ్ము విపులమౌ ఒక కన్ను
ఒగి నాంధ్ర భాష మరొక్క కన్ను
సేవన సంకల్ప చిత్తమే కవచమ్ము
నిస్స్వార్ధతత్త్వమే నిజగుణమ్ము
సంగీత సాహిత్య సంప్రదాయమ్ములే
నిశ్చల మనసులో నెగడుచుండు
ఆంజనేయునిపై సమంజసభక్తియే
వజ్రకాయమునకు వైనమగును
తే.గీ.
విద్య బోధించు కార్య వివేకమహిమ
సహన సద్గుణ పూరిత చతురతయును
కలిగి వెలుగొందుచుండును కలిమి నెపుడు
సరస గబ్బిట దుర్గాప్రసాద సుకవి. (5)

ఉ.
గబ్బిట వంశ సాగర వికాసము పెంచిన చంద్రరూపుడై
కబ్బములన్ రచించి కవి గాయక పండిత సన్నుతుండుగా
పబ్బములన్ వహించుచు ప్రపంచపు శాంతిని కోరుచుండి తా
నిబ్బడియైన కీర్తి గని ఈ భువి వెల్గును యౌవనమ్ములోన్ (6)

తే.గీ.
దండిభట్ల దత్తాత్రేయ ధన్యజీవి
పూని లోకహితమ్ముగా పూజచేసి
పండితులకు సత్కారమేర్పాటు చేసి
పుణ్య నిధిని పొందిరి గదా పూతరీతి. (7)

# గబ్బిటార్య

శ్రీ టేకుమళ్ల వెంకటప్పయ్య నెల్లూరు 9490400858

1-ఉ-శ్రీ రఘురామ సేవకుని చిత్తము నందున నిల్పి భక్తుడై –మీరిన కార్యభారములు మిక్కుటమైనను లెక్క జేయకన్

చేరిన సాహితీ జనుల సేమము గోరుచు నెల్ల వేళలన్ –భారతి కొల్వులో మునిగి భారము నెంచడు చిత్త సీమలన్ .

2-సీ-పుష్కర కాలంబు పుస్తక ప్రేమలో –సరసభారతి యను సంస్థ నొకటి

సాహిత్య వీధిలో సంచ రించుచు దాను –సన్మాన సభలను జరిపి నెన్నొ

గబ్బిట నామంబు గట్టిగా వినబడి –తెలుగు నేలంతయు వెలుగు నింపె

సంగీతసాహిత్య సమలంకృతంబు గన్-ఉయ్యూరు వాడకే ఊపు తెచ్చె

తే.గీ- వయసు భారము కెన్నడు వగవ డతడు-ధనము ఖర్చున కెన్నడు దడవ డతడు

హంగు నార్భాట మనుచును యాశపడడు-కార్యభారము వహియించు గబ్బిటార్య.

3-ఉ-ఉన్నత ఆశయంబులును ,ఉన్నత యోచన వీడ డెన్నడున్ –కన్నది వేగమే జనుల కన్నుల ముందట పెట్టు వార్తలన్

సన్నుతి చేయు నెల్లరను చక్కని పుస్తక పాఠ కుండు గా –మన్నన గోర డేన్నడును మందికి మంచి యె కామితార్థమౌ .

4-తే.గీ .-కనక దుర్గమ సంతతము గాచు మిమ్ము –ఆయురారోగ్య సంపదల్ యమరు నటుల

వేంకటేశుడు మీకిచ్చు విజయ పథము –హనుమ భక్తుల కుండదు అపజయమ్ము.

# దుర్గా ప్రసాదమై

శ్రీమతి కోనేరు కల్పన-విజయవాడ

1-అమ్మ ,నాన్న కున్ దుర్గమ్మ కరుణ చేత –మున్ను దుర్గా ప్రసాదమై మోదమయ్యే

పత్ని పున్నెపు ప్రభయై వాసి గాంచె –సంతతికి అండ దండయై సంతసించె.

2-శిష్యగణములు సేవించు శిష్టు డితడు –సరస భారతి జేగంట చాల గొప్ప

సరసభారతి తీర్ధము సరసమనుచు –వచ్చి చేరె పుష్కర రేడు భవ్యముగను .

3-పంచు అధ్యాత్మికామృతం పటిమ తోడ –సాంఘిక కవి రచయితల సచివు డితడు

శాస్త్ర సంగీత విదురుల సజ్జ సేయు –అర్ధులకు విద్య విత్తమున్ దాన మిచ్చు .

4-అలుపెరుగని యోధుడితడు అబ్బురముగాను –ఆయుధముగ అంతర్జాల మాదునికత

తనకరము నొదిగి గురి తప్పకుండ-చతురిమమున మదియు,మేధ జాడ లెరిగి .

5-సరస భారతి బావుటా సంహితముగ-ఎల్లలను దాటి ఠీవిగాఎగుర వేసే

జవనపు ప్రక్రియల యందు సవ్య సాచి –వేయి పున్నముల చలువ వెలుగితడు .

**సాహిత్య భారతి**

శ్రీమతి మేరీ కృపాబాయి –మచిలిపట్నం -9989347374

ఇది సరసభారతి –రసరమ్య గ్రంథాలువెలువరించే సాహితీ భారతి

ఇంపుగా సొంపుగా అలవోకగా –కవి సమ్మేళనాలు నిర్వహించి

వందలు మించి వేలకు చేరి –అందాల మెక్కిన సుసాహితీ సార్వభౌమ సంస్థ

పిలిచి పిలిచి కథకులను-గెలిచి గెలిచి వారి మనసులను

ఆదరించి సన్మానించి ప్రోత్సహించి –శిఖరాగ్రమెక్కిన వాఙ్మయ సంస్థ

ఇది సరస భారతి –రస రమ్య గ్రంథాలు వెలువరించే సాహిత్య భారతి .

ఇది జ్ఞాన భాండాగారం –తెలుగు భాషను శోధించి ,పరి శోధించే విజ్ఞాన భాండాగారం

తెలుగు సాహిత్యాన్ని దేశంలో దేశ దేశాలలో –కీర్తి బావుటా ఎగుర వేయించి

తెలుగు ఖ్యాతి దశ దిశలా పరిమలింప జేసిన విజ్ఞాన వీచిక

ఇది సరసభారతి –రసరమ్య గ్రంథాలువెలువరించే సాహిత్య భారతి .

సామాజిక రుగ్మతలను గమనించి –అన్నిటికీ సాహిత్యమే పరషధమని ఎంచి

రవి గాంచనిచో కవి గాంచునని రుజువు చేసిన కల్పతరువైన సాహిత్య సంస్థ

ఇది సరసభారతి –రసరమ్య గ్రంధాలువెలువరించే సాహిత్య భారతి .

# ప్రణతి సరసభారతి

శ్రీమతి సింహాద్రి పద్మ –అవనిగడ్డ -9290174624

ప్రణతి సరసభారతి

అమృతోత్సవభారతి –పుష్కరోత్సవ సరసభారతి

సహస్ర చంద్ర దర్శనోత్సవ సాహిత్య సారధి అభినందన చందనం

శివుని జట నుండి గంగోద్భవం –గబ్బిట దుర్గా ప్రసాద్ గారి హృదయం నుండి సరసభారతి ఆవిర్భావం

జీవనదీ యానం నాగరకతకు జీవగడ –సాహిత్య యానం సరసభారతి దివ్య మనుగడ లలితకళల సమ్మిళితమై –ఆధ్యాత్మిక లేపనంతో నిలిచినసరసభారతి –సమాజ రక్షణ కవచం

అనేకానేక ప్రాయోజిక ప్రాయోగిక కార్యక్రమాలతో –బహుళార్ధ సాధక సాహితీ ప్రాజెక్టు

ఎన్నెన్నో గ్రంధాలు చదివితేనో కలిగే పురాణ జ్ఞానం –అందరికీ సులువుగా అందించే ''బాలశిక్ష ''

అమ్మ నాన్న మా అక్కయ్య ,మా అన్నయ్య –అంటూ ప్రియమైన బంధాలు కవి సమ్మేళన సంకలనాలుగా తెచ్చిన'' రసధుని ''

ప్రతిఉగాదిని నవరసాలకవితలతో –షడ్రుచు లందించే –ఆత్మీయ ఆదరణీయ విందు భోజనశాల

నైపుణ్యాన్నెరిగి,సత్కార పురస్కారాలు -అందించే జీవన సాఫల్య ''సంస్కార నిధి ''.గ్రంథప్రచురణలు ,గ్రంథా విష్కరణలు –గీతాపారాయణ –పురాణ ప్రవచనాలు అందించే 'ఆర్ష విజ్ఞాన కోశం ''

పుష్కర కాలంగా ఎంతో మంది ఔత్సాహిక కళా కారుల్ని

అభిమానించి ఆదరించిన ''కళా సంస్కృతీ కల్పవల్లి''.

సరసభారతి ఖండాంతర ఖ్యాతిపొందిన సాహిత్య సేవాసమితి

ఈ పుష్కరోత్సవ వేళ వినయంగా గౌరవంగా -ప్రణుతి ప్రణుతి సరసభారతి .

# పుష్కర మహోత్సవం

శ్రీమతి ఎస్.అన్నపూర్ణ-విజయవాడ -9493312028,9247346614

పుష్కర మహోత్సవం

సరసభారతి పుష్కరకాలం –పరిపూర్ణమైన ఆనంద సంద్రం లో

ఓల లాడ విచ్చేసిరి పండిత ప్రకాండులు

సహస్ర చంద్రదర్శన మహా సారధి –దుర్గా ప్రసాద్ నామ ధేయ ప్రభావతీ సహిత

సాహిత్య కృషీవల సరస్వతీ ప్రాభవమ్ము

ఖండ ఖండాంతరముల వ్యాపింప జేయ

నిత్య యవ్వనులై ,సత్య దర్శనము చేసి

జ్ఞాన వాఙ్మయము లోకాన వ్యాపింప జేయ

''శతమానం భవతి ''అనుచు దేవతలు మునులు

గురువులు దీవించిరే ఈ శుభ సమయాన

మరిన్ని శుభ సంకల్పములు అమలు చేయ

సత్కవి గణములో కూడి అందును నేను 'శుభము శుభము శుభ మంగళము ''.

# సరసభారతి సాహితీ పుష్కర వైభవం

శ్రీ కాట్రగడ్డ వెంకటరావు –గూడూరు -8332917692

సరసభారతి సాహితీ పుష్కర వైభవం

అష్ట పదుల వయసులో –ఇష్టపదులను పలుకుతూ సాహితీ సౌరభాలను

ప్రపంచం నలుమూలలా వ్యాపింప జేస్తూ –నవ యువకునిలా

నేటియువకులకు సవాలుగా నిలిచే ఉత్తేజం తో

వివిధ విషయాలపై లోతైన విశ్లేషణ నందిస్తూ ఆణిముత్యాల్లాంటి ఉత్తమగ్రంధాలు రాసి ప్రచురిస్తున్న బహుముఖ ప్రజ్ఞాశాలి .

తన పుట్టిన రోజును సాహిత్య పండువుగా జరుపుకొంటూ

పెద్దలను సత్కరించి గౌరవించి –పిన్నలను ప్రోత్సహించి ఆదరించి

కవులను అత్యంతా దరంగా ఆహ్వానించి కవితలు చెప్పించి సత్కరించే

మీ సద్గుణం అభినందనీయం ఆదర్శం అనుసరణీయం

మీ సాహితీ వేగం ఇతరులు అందుకోరానిది –మీకు మీరే అనిపించే విధానమది

మీ నేర్పు ఓర్పు కార్యదక్షత నిర్వహణ సామర్ధ్యం మాకు మార్గదర్శకం .

# దుర్గా ప్రసాదాఖ్యం

శ్రీమతి శిష్టా వల్లీ రమా పరమేశ్వరి –విజయవాడ –

1-రమ్మని మమ్ములన్ సరసభారతి పిల్చెను ,సాహితీ ప్రియుల్ –కమ్మని పద్యముల్ చదువ కోరిక కల్గెను నా మదిన్ సరే

పొమ్మని నా విభుండు మరి యానతి నిచ్చిన ,నేనిటన్ వచ్చి –నెమ్మదిగాను మీ ఎదుట నిల్చితి ఉల్లాస ఉత్సాహమ్ములతో .

2-గబ్బిట వారు మా గురువు లైతిరి ,ఉత్సవ సౌరభమ్ములో –నా భవితవ్యమున్ తలచ ,నా మది నిండిన రాగ భావముల్

సంబరమయ్యె నా మనసు అందరి ముందర నన్నిటన్ నిల్పె –అభ్యుదయమ్మునన్ పయన మొందిన రీతికైత సాగగా .

3-అజ్ఞానమైన చీకటిని తుంచి ,వివేకము పంచి ,వారిలో –విజ్ఞానకాంతులన్ పరచి ,మానవులందరూ మంచి దారిలో

సుజ్ఞానవంతులై నడచి ,ఎవ్వరికైనను మంచి చేయుటే –జిజ్ఞాసగా తలంచి ,గురులే నడిపించిరి మమ్ము వెల్గులో.

4-చిక్కని పాల మీగడ వలెన్ మన భాషయు తేట తెల్లమౌ –మక్కువ తోడనే పసిడి మొగ్గలు పల్కవలెన్ పదాలనే

చక్కర వంటి భాష ను పఠించి,మనంబున నిల్పు నప్పుడే –చక్కని రాగ యుక్తముగనొక్క పద్యము చెప్పగా వలెన్ .

5-పుష్కర వత్సరంబుగభారతినే మది నిల్పి ఎందరో –తుషార బిందువుల్ కురియునట్లుగ ,సుందర మందారంబులై

పుష్కర కైతలన్ రచన చేయగా ,సత్కవులైన వారునిన్-పోషణ చేయగా ,సరసభారతి సంపద లియ గావలెన్

6-గబ్బిట వంశ పూర్ణ తిలకం ,ప్రభావతీ మనోహరం –సహస్ర చంద్ర దార్శనిక పూర్ణం మద్గురుం

శిష్య వాత్సల్య పూర్ణం మృదు హాసమూర్తిం –దుర్గా ప్రసాదాఖ్యం నమామి సతతం .

# మహా భారతి

శ్రీమైనే పల్లి సుబ్రహ్మణ్యం –ఆకునూరు -9290995112,9490420476

మహా భారతి

మహా భారతి మా సరసభారతి –సరళరేఖా మార్గాన సాహితీనావ సాగిపోతుంది

అంశ మేదైనా ఆణిముత్యమే-అన్నయ్యంటేఆభరణం

అక్కయ్యంటే అభిమానం

నేటి ఆధునిక జీవనం లో –తెలుగు నేలపై వెల్లి విరిసిన –అలనాటి కవితా గీర్వాణం

పాశ్చాత్య సాహితీ తత్త్వం -యువర్తర కరదీపికం

ఆంగ్లకవుల ముచ్చట్లు తెలుగు వారికి అనుపానమే

నెల నెలా పున్నెమలా సాహిత్య వేదిక సరసమాడేది

కరోన మహమ్మారి –మానవమనుగడనే మార్చేసింది

కరుణ రసం లేదు ఖఠోర రసం నీరసం తప్ప

ప్రతి ఉగాదీ పంచాంగ శ్రవణం ముక్తి దాయకం

సూక్తి సుధ అపురూపం

సరసభారతి గబ్బిట వారి మానస పుత్రిక

అందరికీ అక్కా చెల్లీ

పుష్కర సాహితీ సేవలో పునీతమైంది –వందనం అభివందనం .

# అభినందన అక్షరాంజలి

శ్రీమతి ముదిగొండ సీతారామమ్మ మచిలీ పట్నం 9299303035

అభినందన అక్షరాంజలి

1-కం.-జన్మ దిన శుభా కాంక్షలు –సన్మదితో చెప్పుచుంటి సాగుము భువిలో

కన్మిది శతాయు వందుచు-మున్ముందుకు సాగుమయ్య మోదము తోడన్ .

2-సీ- గబ్బిట వంశాబ్ది ఘనుడు దుర్గా ప్రసాద్ –మదిని యశము నొందెమహితముగను

సరసభారతి నిల్పి సరసాంతరంగు డై-సేవించె భారతి సేసలంది

సూర్య శిష్యుం డైన శూరుడు పావని –ఆలయంబున సేవ యతిశయించె

ఒజ్జగా తానుండి ఓర్పుతో బోధించి –భవితను దిద్దిన భాగ్యశాలి

తండ్రిగా బిడ్డల తనివార పెంచెను –తాతగా నిలిపెను ధర్మ పథము

తే.గీ .-వేయి చంద్రుల దర్శించె వేడ్క మీర –భావి జీవితమందున భవుడు సతము

ఆయురారోగ్య సంపదలంద జేసి –గూర్చు శాంతియు విశ్రాంతి కోరు రీతి

రక్ష సేయును  సతతము రామ బంటు .

3-సీ-కవి సమ్మేళనము కైకవితలు వ్రాయించి –అచ్చు వేయించిరి యతిశయింప

పండితాళి ని పిల్చి పరమ సంతోషాన –సత్కారములు చేసే సభలయందు

సంగీత సాహిత్య సారమేరిగిన –సరసుల పిలిపించి జగము మెచ్చ

అంజనీ సుతునకు యానందము గ జేయు –సేవలు శక్తి ని సిరుల నిచ్చె

సరసభారతి పుష్కర సారముగను –సాహితీ సౌరభ సభ సాగ జేసి

జనుల గుర్తింపు గౌరవ సరళి గూర్చి –వంద సంవత్సరముల్ సాగగ వైభవమును

ఘనుడు దుర్గా ప్రసాదను ఘనత నందె.

# ప్రతిభెంతో

శ్రీమతి కొమ్మరాజు కనక దుర్గా మహాలక్ష్మి మచిలీ పట్నం 8179104434

1-తే.గీ.-పుష్కరంబుగా ప్రతిభతో పుడమి వెలుగ-సరసభారతి ప్రతిభెంతో జగతి కెరుక -వివిధ ప్రక్రియల రచియించె విలువ తెలిసి –గబ్బిట ప్రసాద వర్యుల ఘనత తెలుప –నాకు చాలని జ్ఞానంబు నమ్మ సుమ్మి .

2-తే.గీ.-సహస్ర చంద్ర దర్శన భాగ్య శాలివైన –సరస హృదయుడా సాగుమా శతము నీవు-సర్వ జనులకు రస సుధ చాల పంచ –దివ్యమైనది మీ జన్మ ధీర చరిత .

3-తే.గీ .-పాలు నీరును కలిసిన పగిది మీరు –రవిని వీడని ఛాయలా రంజిలంగ-నిలిచి యుందురు నియతితో నిత్య మిలను –అందుకొను మిదె సహస్రాది వందనంబు –ఆయురారోగ్య భాగ్యాలు అవని మీకు .

# పాదాభివందనాలతో..మీ పంతుల

సకల కళాభారతి సరసభారతి-సంగీత సాహిత్య సేవా సంస్కృతి

గబ్బిట దుర్గా ప్రసాద్ గారి మనోరథి –తెలుగు భాషా ప్రగతికి వారధి .

కవి గాయక పండితులను మెప్పిస్తుంది –ఎంతటి వారి నైనా రప్పిస్తుంది

మేధావులు ,నాయకులు మదిని గెలుచు కొన్నది –పేద సాద బాధితులకు అండగా ఉన్నది

అనేకానేక గ్రంథాలకు రూపమే అద్దినది –పలు విధ సేవలో రూప కర్త తానైనది

ఘనులకు ఘన సత్కారాలు –సాంస్కృతిక వేడుకలకు వేదిక అయింది

సరి కొత్త కార్యాలకు రూపు దిద్దింది –పుష్కరమే దాటినా నిత్య నూతనంగా ఉంది

శతాబ్దాల చరితగా సంస్థ నిలిచి పోతుంది .

<u>గ</u> గనానికి తాకిన కీర్తితో

గ బ్బి టకులతిలకులై
అన్ని టి దూసుకుపోతూ
పండితా దు లమెప్పుపొందుచు
కనక దు ర్గా మాతఆశీస్సులతో
ఎటువంటిస్వ ప్ర యోజనంచూడక
ఘనులుదుర్గాప్ర సా దువరులు
అనేక అవార్డులం దు కోవాలని ఆశిస్తూ
జన్మదిన శుభాకాంక్షలు..మీ పంతులవేంకటేశ్వరరావు

# మంకు శీను

బహుళగ్రంథరాజమ్ములువ్రాసినావు
హితముగాసభలనునిర్వహించినావు
శుక్లపక్షచంద్రునివలె శోభిలుమిక
గబ్బిటాన్వయాగొనుశు భాకాంక్షలివియె

# అభినందన మందారమాల

శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి –బెంగుళూరు 9885628572

1-''శ్రీయుతుడీ మిత్రుని ఆ-ప్యాయత కొలబోయ జాలు పాత్రలు గలవే –ఈయన ఉన్న దుయూరున –వేయూళ్ళు ధ్వనించు వీరి విఖ్యాతి యహహా ''

2-గబ్బిట ప్రసాదున –కబ్బెనె వయసు మించిన కర్తృత్వ మునన్ –అబ్బుర పరచు నుగాదుల –కబ్బపు షడ్రుచు లిడు నయగారపు విందుల్ ''

3-వంశానుగత ప్రతిభకు –అంశాను గతమ్మగు రచనాభ్యాసముతో –శంశచ్చారిత్రక గ్రం-థాంశువులావిష్కరించు ద్రవిణము నందెన్ ''

4-గీర్వాణాద్రములందున్ –పర్వగ పాండిత్యము లొక వంక గడి యించెన్ –సర్వజనామోదాంగ్లము –పర్వము గాన్ తద్రచన పాటవ మెంచుడీ.

5-ఎంతటి పఠ నా సక్తుం-డెంతటి వైమర్శిక ఖని ,యే జన్మ తప –మ్మింతగ ఫలియించినదియో-సుంతయు గర్వమ్ము లేని సుకృతి యితండే.

6-తానార్జించిన జ్ఞానము –పూనిక సాహిత్య బంధువులకున్  బంచున్ –ఏనాటి ముచ్చటైనను-ఈ నాటి పలుకు తళుకుల ''ఈమెయి'లంపున్ .

7-పట్టిన పొత్తపు లోతులు –తట్టిననే దాని విలువ తా వెలయించున్ –పట్టవు తన పెర భేదము –లిట్టెసమసమాజ దృష్టి ఇతని వరియించెన్ .

8-పిన్నల పెద్దల నెల్లర –మన్నించుటలో సహృదయ మాధురు లొల్కున్ –పున్నెంపున్ దాతల యెడ-పన్నుగ నిజ హృత్ కృతజ్ఞ భావన చిల్కున్ .

9-సరసుడు తానై తనతో –సరసపు భారతిని నడుపు సంస్థాపకుడున్ –కరమరుదుపుష్కరోత్సవ- పరిణతి సాధించి నట్టివ్రత కల్పుడవహో ''

10-అభినందన లందించెద –ప్రభవమ్మాదిగ సహస్ర రాకేందు ప్రభల్ –సభ చేయగ దర్శించిన-విభవుడు దుర్గా ప్రసాద వేదవిదునకున్ .

11-శివ హనుమల ఆలయములు –స్తవనీయ గ్రంథశాల ,తచ్చిరునామాల్ –జవ మిత్తురు వారిరువురు –ప్రవిమల విజ్ఞాన ఖనులు గ్రంథాలయముల్ .

12-శివుని జటన్ గలచంద్రుడు –భవదీయము శత వసంత భవ్యోత్సవమున్-అవలోకింతుననె సఖా –శివుడు తదాస్తనగ దుర్గ స్మిత ముఖి యయ్యెన్

# నమో నమః

^^^^^^^^^^^

దుర్గాప్రసాద రాయు న
నర్గళ సాహిత్య ధార నవలోకింపన్
భర్గుడె తద్వయసు మరచె
దుర్గ " చిరంజివి "యన యథోచితరీతిన్

పువ్వాడ తిక్కన సోమయాజి
27-06-2022


ఇట్లు

శుభాకాంక్షలు

Y.V.B.T. సుందరి

M.T.M

సెల్. నెం:-9298229991

ది.27-6-2022

ది.27-6-2022

# శుభాకాంక్షలు

"వసుధ" 9490832787

పెద్దలు గురుతుల్యులు శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ గారికి🙏🙏💐💐💐💐💐💛💛 పుట్టినరోజు శుభాకాంక్షలు... సహస్ర చంద్రదర్శన దినోత్సవ శుభాకాంక్షలు...మీ దంపతులకు ఆయురారోగ్యా ఐశ్వర్యాలను ఆనందాన్ని మనశాంతిని కలుగజేయాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఈరోజు మీరు నిర్వహించనున్న సభా కార్యక్రమాల ఆహ్వానం అందింది..అందులో ప్రత్యక్షంగా హాజరు కాలేక పోతున్నందుకు బాధగా ఉంది..బ్యాంక్ పనిదినము అయినందున వీలు కావడం లేదు..మీరు తలపెట్టిన కార్యక్రమాలన్నీ సంతోషకారంగా నిర్విఘ్నంగా పూర్తి కావాలని కోరుకుంటూ మీకు మీ కుటుంబ సభ్యులకు సరసభారతి కుటుంబ సభ్యులకు నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను..🙏🙏🙏

# సామాజిక మాధ్యమాలలో

ఆలయలం లో 20.06.2022 (తిధుల ప్రకారం జరిగిన పుట్టిన రోజు సహస్ర చంద్ర దర్శన కార్యక్రమం )




Youtube లో ఆహ్వాన పత్రిక



Youtube లో ప్రసారం అయిన సమావేశ (క్లిక్ చెయ్యండి)




# వార్తా పత్రికలలో

సరసభారతి సాహితీ పుష్క రోత్సవం పై ఇవాళ్టి జ్యోతిలో వార్తా కధనం

## సాహిత్య రంగాన్ని ఆదరించాలి

**ఉయ్యూరు, న్యూస్‌టుడే:** సాహిత్య రంగాన్ని ప్రతి ఒక్కరు గౌరవించాల్సి ఉందని మాజీ ఎమ్మెల్సీ వై.వి.బి.రాజేంద్రప్రసాద్ అన్నారు. బుధవారం స్థానిక గ్రంథాలయంలో ఏర్పాటైన సరస భారతి సాహిత్య అకాడమీ వ్యవస్థాపకుడు జి.దుర్గాప్రసాద్ జన్మదిన వేడుక, సహస్ర చంద్రదర్శన కార్యక్రమంలో వైవీబీ ముఖ్యఅతిథిగా హాజరై ప్రసంగించారు. జి.దుర్గాప్రసాద్ రచించిన అమెరికాలో న్యూక్లియర్ శాస్త్రవేత్త ఆకునూరి వెంకటరామయ్య జీవిత చరిత్ర పుస్తకాన్ని వైవీబీ ఆవిష్కరించారు. దుర్గాప్రసాద్ దంపతుల్ని ఆయన ఘనంగా సత్కరించారు. డాక్టర్ దివి చిన్మయ, సరస భారతి ఆకాడమి సభ్యులు పాల్గొన్నారు.



పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న మాజీ ఎమ్మెల్సీ వైవీబీ, అతిథులు

# గబ్బిట దుర్గా ప్రసాద్‌ని అభినందించిన వై.వి.బి రాజేంద్ర ప్రసాద్

ఉయ్యూరు, అమరావతి : సరస భారతి సాహిత్య అకాడమీ వ్యవస్థాపకులు గబ్బిట దుర్గాప్రసాద్ జన్మదినం మరియు సహస్ర చంద్రదర్శనం సందర్భంగా ఉయ్యూరులో ఏర్పాటు చేసిన కార్యక్రమ ంలో తెలుగుదేశం పార్టీ రాష్ట్ర ఉపాధ్యక్షులు వై.వి.బి. రాజేంద్రప్రసాద్ పాల్గొని శుభాకాంక్షలు తెలియజేసారు. అనంతరం దుర్గా ప్రసాద్ రచించిన మన ఉయ్యూరు ప్రాంత వాసులు ప్రస్తుతం అమెరికా లో ఉంటున్న న్యూక్లియర్ శాస్త్రవేత్త అకునూరి వెంకట రామయ్య జీవిత చరిత్ర పుస్తకాన్ని ఆవిష్కరించారు. పుస్తకాన్ని రచించిన దుర్గా ప్రసాద్ ని, ప్రచురించిన ఉయ్యూరు పట్టణవాసులు ప్రస్తుతం అమెరికాలో ఉంటూ ఉయ్యూరు లైబ్రరీ నిర్మాణానికి ఆర్థిక సహాయం చేసిన మైనేని గోపాల కృష్ణ ని అభినందించారు. ఈ సందర్భంగా వై.వి. బి మాట్లాడు తూ




ఏడాదికి 12 పౌర్ణమి ల చొప్పున 82 ఏళ్లకు పైగా జీవించిన వ్యక్తి తన జీవిత కాలంలో 1000 చంద్రోదయాలు చూస్తాడని దీనినే సహస్ర చంద్రదర్శనం అంటారనియన్నారు. గబ్బిట దుర్గా ప్రసాద్ సాహిత్య రంగానికి చేస్తున్న సేవలు అభినందనీయం అని అన్నారు. అనంతరం రాజేంద్రప్రసాద్ దుర్గా ప్రసాద్ దంపతులను ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ వైద్యులు చిన్మయ, దుర్గా ప్రసాద్ కుటుంబ సభ్యులు, సరస భారతి సాహిత్య అకాడమీ సభ్యులు పాల్గొన్నారు.

## రచనలు

# ముద్రిత రచనలు

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన ,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో .క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రచురణ | అంకితం | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవీణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 116 |
| 3 | దర్శనీయ ధైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 164 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 159 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహత్యం, కధలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 120 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 120 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 184 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 632 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా\|\| భండారు రాధాకృష్ణ మూర్తి , సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 144 |
| 15 | ధైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్ఛ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 80 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 17 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంధం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుచ్చా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం ,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి , సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |
| 23 | ఆధునిక అంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 168 |
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజి.లాల్యే ఇంగ్లీష్ "మల్లినాధ'అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 120 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 80 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

**సంపాదకత్వం**

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య "హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే"రెడీలు' | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణాచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతారావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శ్రీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుధైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ స్రవంతి | (సాహితీ మండలి తరఫున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

**అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు**

| | పుస్తకం పేరు | వివరాలు | విడుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు | Emeritus of South Asian Studies at the University of Visconsin, Madison లో Professor Da vid.M.Knipe Vedic Voices-intimate Narratives of a Living Andhra Tradition కి అనువాదం | 19-04-2019 | 67 |
| 2 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 3 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |
| 4 | దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| 5 | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి సాహిత్య, సామాజిక సేవ వార్తాపత్రికల సంకలనం 132 వ జయంతి కానుక | 15-08-2022 | 45 |
| 6 | శమీ అష్టోత్తరం పూజా విధానమ | శమీ అష్టోత్తరం పూజా విధానమ | 05-10-2022 | 15 |
| 7 | సహస్రచంద్రదర్శనం | **సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం** | 05-10-2022 | 60 |

రాబోవు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కార్తీకం లో మా పంచా రామ సందర్శనం కిరాతార్జునీయం శ్రీనాధుని భీమ ఖండ కధనం,కాశీ ఖండం గౌతమీ మహాత్మ్యం | | 04-11-2022 | 450 |


<u>గబ్బిట దుర్గా ప్రసాద్</u>

http://sarasabharati.wordpress.com
http://sarasabharativuyyuru.wordpress.com
http://suvarchalaanjaneyaswami.wordpress.com

youtube channel : https://www.youtube.com/channel/UCCB-Z-3t-3SxVy1G_BcwS6w

FB page : https://www.facebook.com/sarasabharathi.vuyyuru

Telugu Wikipedia
: https://te.wikipedia.org/wiki/%E0%B0%97%E0%B0%AC%E0%B1%8D%E0%B0%AC%E0%B0%BF%E0%B0%9F_%E0%B0%A6%E0%B1%81%E0%B0%B0%E0%B1%8D%E0%B0%97%E0%B0%BE%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B0%B8%E0%B0%BE%E0%B0%A6%E0%B1%8D
Gabbita Durga Prasad
Rtd. head Master   Sivalayam Street
Vuyyuru  521165  Krishan District
Andhra Pradesh
India
Cell :     **9989066375**
**8520805566**
Land Line : 08676-232797